

# అమ్మదయ

## శ్రీ నారుమంచి వేంకట అనంతకృష్ణ గారి

# షష్టిపూర్తి

## అభినందన సంచిక



ప్రజ పద్యం
facebook
పచ్చని పద్యాన్ని ప్రేమిద్దాం


సంపాదకులు

**చింతా రామకృష్ణారావు**



# అమ్మదయ

## శ్రీ నారుమంచి వేంకట అనంతకృష్ణ గారి

# షష్టిపూర్తి

## అభినందన సంచిక




సంపాదకులు

**చింతా రామకృష్ణారావు**

# అమ్మదయ - శ్రీ నారుమంచి వేంకట అనంతకృష్ణ గారి షష్టిపూర్తి అభినందన సంచిక


ప్రథమ ముద్రణ : శ్రీ విళంబి అధిక జ్యేష్ఠం, జూన్, 2018

రచన : సహృదయులైన 49 మంది కవులు

సంపాదకులు : శ్రీ చింతా రామకృష్ణారావు

వెల : అమూల్యం




ప్రాప్తి స్థానం :


**Chinta Ramakrishna Rao**
Flat No.503, Sri Ratna Vihara Apartments, Bus Busbody Building Unit,
Nagarjuna Enclave Road, Miyapur, Hyderabad-49
Ph : 8247384165 email : chinta.vijaya123@gmail.com

**V.R.Ganapathi,**
H.No. 2-10-355, MSM Sannidhanam,
Jyothinagar, Karimnagar - 505001. Telangana.
Ph : 9160061172, Mail : msm_vrganapathi@yahoo.co.in

**M.V.Patwardhan,**
1-178/3,Maruthinagar ,Road No 2 , Bellampalli road,
Mancherial, Phone: 9393751540,
email: rasajhari@gmail.com

**N.V. Anantha Krishna**,
Plot No.80, Sri Sai Nagar, Road No.4,
Opp.Sri Saibaba temple, Nagole Post,
Hyderabad 500 068. Phone: 9246531895
email: ananthcourt@rediffmail.com

# విషయసూచిక

# ఆశీస్సులు

చిరంజీవి అనంతకృష్ణ నాకు దేవుడిచ్చిన సహోదరుడు. అతని షష్టిపూర్తికి 'అమ్మ దయ' పేర ప్రజ–పద్య బృంద కవి మిత్రులందరు కలసి ప్రేమ పూర్వకముగా వ్రాసిన పద్యాలను సంకలనము చేయుటలో నాకు పెద్దరికమిచ్చి సంపాదకత్వ బాధ్యతలనిచ్చారు. ఈ పద్యాలలో ప్రతి కవి కూడా తమ మనఃపూర్వక ప్రేమానురాగాలు ప్రతిబింబించారు.

అనంతకృష్ణగారి షష్టిపూర్తి గూర్చి తెలిసిన తరువాత వారిని అభినందిస్తూ పద్యములు వ్రాయాలని అనిపించింది. ప్రజ–పద్యం గ్రూపులో ఈ విషయం ప్రస్తావించగా స్పందించి మిత్రులందరూ తమ తమ పద్యముల ద్వారా వారికి అభినందనలు తెలిపారు. వారి షష్టిపూర్తి నాడు మిత్రులమంతా కలసి ఆ సంబరాలలో పాలుపంచుకొని అక్కడ ఆ పద్యాలు వేదికపైన చదివి మరీ అభినందించాము. ఐతే ఆ పద్యాలన్నీ పుస్తక రూపముగా వారికి బహుకరించాలని మరొక ప్రతిపాదనను ఆమోదించి, అన్ని విధాల సహకరించి చి. అనంత కృష్ణ గారి పై పద్యాక్షతలు చల్లి ఆశీర్వదించిన వారందరకు పేరు పేరున కృతజ్ఞతాభినందనలు.

**చింతా రామకృష్ణారావు**

**చిత్రకవితా సమ్రాట్**

హైదరాబాద్

ఓం గం గణపతయే నమః ఓం శ్రీ వాగీశ్వర్యై నమః

# 'అనంత'గుణసంపన్నుడు నారు'మంచి'వారు.

నరత్వం దుర్లభం లోకే విద్యా తత్ర సుదుర్లభా,
కవిత్వం తత్ర సుదుర్ల శక్తిస్తత్ర సుదుర్లభా .

అని ఆగ్నేయ పురాణములో చెప్పబడినట్లు దుర్లభమైన మానవజన్మలో విద్యావంతుడగుటయే శ్రేష్ఠముకాగా అందునా కవి యగుట ఉత్తమోత్తమైనది. అందున సత్కవిత్వశక్తి పటుత్వములను సాధించువారు. ఏ పూర్వ జన్మము వలననో సహృదయాహ్లాదకర కవిత్వ పటుత్వ శక్తిని పొందగలిగే కవివరేణ్యులు కొందరే ఉందురు. నారుమంచి వారు అనేక శతకకర్తలు. నాకు తెలిసి వారు నిరన్తరాధ్యయనశీలురు. వారు వృత్తిరీత్యా న్యాయావాదులు. ప్రవృత్తి రీత్యా కవివరేణ్యులు. స్థూలంగా చూస్తే రెంటికి పొంతన కుదురదు. నేరస్థులు, నేరచరిత్ర గల వారి దౌష్ట్యమును గురించి, వారినుండి సజ్జన రక్షణ గురించిఅహోరాత్రులు ఆలోచనే ! ఇక రసానందకర పద్యరచనావకాశ సమయము దొరుకుట కష్టమే !

ముఖపుస్తకమిత్రుడిగా వారి కలయికద్వారా గత 5, 6 సంవత్సరాలుగా వారికి సన్నిహితుడనైనాను. వారు వృత్తిరీత్యా ఎప్పుడు సంయుక్తాంధ్రప్రదేశ్ పర్యటన నిరన్తరము గావించెడివారు. ఇంతటి బిజీ లోను వారిలోని కవి, సహృదయుడు వారిని విడిచిపెట్టేవారు కాదు. అంతే కాక పౌరాణికులై శ్రోతలను ధర్మమార్గులను గావించుటలో సఫలురైనారు. న్యాయవాదిత్వానికి, కవిత్వానికి బంధాన్ని వారు కల్పించారు. రెండింటిలోన కూడ ప్రతి పలుకుపైన నిశిత పరిశీలన, శ్రోతను ఆలోచింపజేసే, ఆనందింపజేసే తత్వము, లోకాన్ని సన్మార్గ దిశసంచాలమునకై ప్రేరేపించు వాగ్ధిషణత్వములు ఉన్నవి.

తాను కవి అగుట ఒకటైతే ప్రేరేపిస్తూ ఇతరులను మార్గదర్శనముద్వారా కవులను చేయుట మరొక ఉన్నతమైన సద్గుణసంపన్నులు. ఏమి రాని వాడినైనా

పద్యరచనలో ప్రవీణుడిని గావించు శక్తి సంపన్నులు. మృదు మధురముగా ‘నీవు సమర్థుడవం’టూ ‘ పద్యరచన ఎంతో తేలిక ’ అంటూ తేలిక పదాలతో ఛందో బద్ధకవిత్వాన్ని వ్రాసే విధానములో శిక్షణనిస్తుంటారు. సంస్కృతపద్యములను మాత్రమే వ్రాసే నాకు తెలుగులోని ఇంద్ర చంద్ర, సూర్య గాణాదులు, తెనుగు యతి ప్రాసల గజిబిజీ చూచి తెలుగులో ప్రయత్నించి, సంస్కృత సంబంధములైనందున శార్దూల, చంపకమాల, ఉత్పలమాల, మందాక్రాన్తాది వృత్తాలను వ్రాసేవాడిని. వారి ప్రోత్సాహము వలన తెలుగున ఆటవెలది, తేటగీతి సీసం. కందములు వ్రాయనారంభించాను. ఆంగ్లభాషాధిషణుడై స్వకీయవాక్పటిమతో న్యాయాధిపతుల మనః పీఠమున సన్మాన్యుడై, న్యాయమునకు విజయమును కలిగింపజేయు న్యాయవాదకులభూషణుడునూ, సంస్కృతాంధ్ర పద్యరచనా ధిషణుడునూ, అనేకానేక శతకగ్రన్థగ్రథన కోవిదుడునూ, నిత్యసేవితాదేవ్యనుగ్రహ ప్రసాదఫలపాత్రుడునూ, వనజాతాయత నేత్రవనజానన జగజ్జననీవనజా స్వరూపిణీ వనజాదేవి పాణిగ్రాహియై, గార్హస్థ్యాశ్రమ ధర్మపరిపాలకుడునూ, సత్పుత్ర కళత్ర భృత్య పరివార వర్గముచే ఆతిథ్యాశ్రితా సేవా తత్పరాతిథేయుడునూ, కవితాపటువర్ధనులు, గవికుల గణపతులునూ ఐన పట్వర్ధన, గణపతి సహితులై ‘ప్రజ–పద్య’ వేదికా పరివర్తిత కవికోకిలాశేష జన సముద్రుడునూ, కవికుల మనోహ్లాద కవితా చన్ద్రికా కిరణ చంద్రుడునూ అగు శ్రీ నారుమంచి అనంతకృష్ణగారి షష్టిపూర్తియని తెలియగా అనంద రసభరితమైన ఏ మత్తకవి కోకిల కూయదు? నలుబది తొమ్మిది కవివరేణ్య హృదయములుప్పొంగినవి.

సహృదయ హృదయానంద భరిత గావించ వేదికా తరువునెక్కి గళమెత్తి, మధుర మత్తకంఠములతో దశదిశల మ్రోగించినవి. వారి గుణగణాలు విశదీకరించినవి.శ్రీ చింతారామకృష్ణారావు గారు రాఘవశార్దూలుడిని ప్రార్థించుతూ ఈ కవి శార్దూలమును రక్షించుమని కోరుతూ వీరి గుణగణాలను

రా నా రాఘువ! ధీ నిధిన్ గనర, నార్మంచీతడే దేవరా!జ్ఞానానందుని, తుల్య పూర్ణుని, నుత క్షాంతున్, గృపం జూడరా! జ్ఞానిన్ బ్రోవరనీవు ముందుగను సుజ్ఞాన ప్రదా నంద! రేడా! నీవేలుమనంతు పండితుల నీడన్ జ్ఞాన శోభస్కరా! అని ధీనిధి, జ్ఞానానందుడు, తుల్య పూర్ణుడు, నుత క్షాంతుడు, జ్ఞాని యని ప్రశంసించినాడు అనుటకంటే నిజమును నిరూపించినాడనుట శ్రేయస్కరము. తమ నవ పద్యరత్నముల ద్వారా హృదయముప్పొంగొంప జేయుటే గాక కవులకు తమ చిత్రబన్ధ కవితలనందించుతూ మార్గదర్శములైనారు చింతావారు.

ఇక శ్రీ మద్దాలి శ్రీనివాస్ గారు “ఆ. అతని పలుకులందు నమ్మ తా కొలువుండునతని యాత్మ నందు నామె యుండు నెపుడు నమ్మచింత నతని మదిని యాడు నతని రూపమదియు నమ్మ” రూపు అని అనంతులవారి విజయాలకు కారణము జగదంబానుగ్రహమే యని విషయాన్ని నమ్మినారు. అందుకే నారుమంచి వారి సభలలో జనులహృదయాలకు వాగమృతమును పంచుతున్నారన్నారు.

ఈ కందమున :-

కం. సభలను కడు నేర్పున వా
గ్విభవము తో నెఱపు చుండు విజయ పథము లో
శుభమును శాంతిని చేకూ
ర్చి భళి యనుచు మెచ్చ జనులు సిరులును గలుగన్.

శ్రీ యర్రమిల్లి బావాజీగారు – ‘ఆ.వె.కలము తోడ మంచి కవితల నల్లుచు – కొలను నంత తమ్మి పూలనింప పంపె నిలకు తాను పరవశమ్ముగురీతి – నలువ రాణి మిమ్మ నంత కృష్ణ!!’ అంటూ మిమ్ములను ఆ నలువలరాణియే భూతలానికి మిమ్ముల కవితలనల్ల పంపినదని హృద్యముగా సెలవిచ్చినారు. వారి మాట నిజమే ! అందులకే తాను కవియే గాక తన చుట్టూరనున్న తెలిసినవారిని, తెలియనివారిని కూడ శక్త్యనుసారము అందరిని కవుల

గావించవలెనను సత్సంకల్పముతో సమౌజ్జిలైన పట్వర్ధన, గణపతులగార్లతో కలిసి త్రిమూర్తులుగా నేర్పడి ప్రజపద్య వేదిక ఏర్పర్చి అనేకానేక విషయములద్వారా అందరి కవితాధార ఇనుమడింపజేయ ఉద్యుక్తులైనారు. సంయుక్తాంధ్రప్రదేశమంతా అనేకానేక కవులేర్పడి కవితాధరలను కురిపించినారు. అట్టి సంపుటములుగా వెలువడుతున్నవి. అందులకే శ్రీమాకెన ఆచార్య సీతారామ పాత్రుడుగారు తన సీసపద్యమాలికలో

సీ.కార్మిక సంక్షేమ కార్యక్రమాలపై! – సర్కారు బడి గుళ్ళ!చదువుపైన!
తొలకరి చినుకుల తలపుల రైతుల – వృద్ధాప్య జీవన వ్యధల పైన
జనరక్షనార్ధమై!జలరక్షచర్యపై! – ప్రజల బాగోగుల!విజనుపైన!
విఛ్ఛిన్నమవుతున్న! వేదనా భరితమౌ! – వైవాహకర్తవ్య!యావపైన!
మాదకద్రవ్యాల మత్తులో తులతూగు – యువత ప్రభావంపు!భవితపైన!
సమ సమాజము నందు!సంఘాలశ్రేయస్సు! – మనపాత్రలోనున్న!మనసుపైన!
భాషపై మనతెల్గు!పరిరక్షణమ్ముకై! – భాధ్యతలున్నట్టి! ప్రభుతపైన
వైవిద్యభరితమౌ!వైద్యరంగమునందు! – మార్పులోగలసమీకరణపైన
దృశ్య దర్శిన పట్ల వశ్యమైన సమాజ – ప్రాభవ కదనాల!వరసపైన!
భారతరాజ్యాంగ !భావప్రకటనలో! – స్వేఛ్ఛపై మనకున్న! ఇఛ్ఛపైన !

తే.గీ. అర్ధవంతంపు!సంవత్సరార్ధమంత! –
నాంధ్రతెలగాణప్రజ!పద్యమధ్వరమ్ము!
నిర్వహించి!రసజ్ఞుడై!సర్వకవుల –
కాణిముత్యాలని!యనంతకృష్ణుడిచ్చె! (3)

అని ప్రశంసించినాడు.

వసంతమల్లప్ప గారు కూడ సీ. ఆణి ముత్యమ్ముల యాణి ముత్యములను – ఆణి ముత్యాలు గా నచ్చు వేసి అందమౌ పుస్తక మందించ నశ్రాంత – కృషి సల్పె తానొక ఋషిగ మారి అరువది నిండినన్ ఇరువదిలో నుండు – చురుకుదనమ్మునే చూపు వాడు సేవానిరతుడైన స్నేహశీలుడగుచు – పరుల

కుపకరించు పరహితుండు

ఆ.వె అతని నభినుతించి యభినందనలు శుభా – కాంక్ష లిటుల పద్య కవిత లల్లి తెలుపుచుంటి, జాను తెలుగులోనతడొక – ఆణి ముత్యమనుట యగును సబబు. ప్రజ పద్యం ద్వారా మన త్రిమూర్తులు నిర్వహించిన అనేకానేక విషయాలను చక్కగా 'ఆణిముత్యాల ' పేరున సహృదయలోకానికి అందించిన కృషిని ప్రశంసించినారు. పట్వర్ధనులవారు యువకులైనా అనంతులవారు, గణపతులవారు ఇరువురుకూడ షష్టిపూర్తులైనవారే ఐనా వారి ఉత్సాహము ఇరువది వయఃప్రాయులైన యువకులుగా తెనుగునాటంతా తిరిగారు. సాహితీ చరిత్ర లో ఒక సుస్థిరస్థానాన్ని నిలుపుకున్నారు.

షష్టిపూర్తి గావించుకుంటున్న అనంతకృష్ణ గారికి అభినందనలు. వారికి తోడై ఈ సాహిత్య కృషీవలురైన శ్రీ గణపతి పట్వర్ధన్ గార్లకు , ఇందులకు సహకరిస్తున్న శ్రీ చింతారామకృష్ణారావు గారికి, మహామహులైన

శ్రీ కందిశంకరయ్యగారువంటి ఎందరో కవివరేణ్యులు అవధానులున్నారో వారందరికి ధన్యవాదములు కృతజ్ఞతలు. మరిన్ని కవితా విపంచికలు వారి ప్రోత్సాహం తో వెలువడాలని ఆశిస్తూ

సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్

బుధజన విధేయుడు

**కొరిడె విశ్వనాథశర్మ.**

విశ్రాంత ప్రాచార్యులు.

# కావ్య సమీక్ష

# నారుమంచి వారి నోరుమంచి

ఒకే అభిప్రాయం కలవారందరినీ ఒకచోటికి తెచ్చేందుకు మార్క్ జూకర్‌బర్గ్ అనే ఆంగ్లేయుడు ముఖపుస్తకాన్ని కనుగొన్నాడు. ఆంగ్లేయుల సంస్కృతి ప్రకారం ఆడం మఱియు ఈవ్ లు ఆదిదంపతులు. హైందవ ధర్మం ప్రకారం జగత్పితరులు ఆదిదంపతులైన శ్రీ పార్వతీ పరమేశ్వరులు. వారే వాగర్థాల వలె కలసి ఉండి వాగర్థాలకు కారకులై మనకు వాగర్థాలను అందిస్తున్నవారు కూడ. రసనిష్పత్తితో కూడిన వాగర్థాలు కల కవులందఱము ముఖపుస్తకం సహాయంతో ఒకచోటుకు చేరే అవకాశమేర్పడింది. అదే ప్రజ – పద్యం అనే సమితి. తెలుగు పద్యాన్ని రక్షిద్దామనే ఈ సమితి లక్ష్యం అన్ని విధాల నెరవేరింది. బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారు, మాన్యశ్రీ వీ.ఆర్.గణపతి గారు, మాన్యశ్రీ పట్వర్ధన్ గారు త్రిమూర్తులై ప్రజ – పద్యం అనే ఈ సమితి పర్యవేక్షిస్తున్నారు. వీరి పర్యవేక్షణలో తెలుగు పద్య వ్యవసాయం మూడు పువ్వులు ఆరు కాయలుగా విరాజిల్లుతూ ఎప్పటికప్పుడు ప్రతిఫలాలనందజేస్తూ ఉంది. అందుకు కారకులైన ఈ త్రిమూర్తులు సదా అభినందనీయులు.

ఈ సమితి ద్వారా మనం కావ్య శరీరాన్ని ఏర్పరచి ఆత్మను ప్రతిష్ఠించినాము. అలా ఏర్పడినదే ఈ గ్రంథరాజము. ఇందులో నాయకులు బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారు.

“దైవం మానుష రూపేణ” అన్నారు పెద్దలు. దేవుడు మనిషి రూపంలోనే ఉంటాడు. భగవంతుడు ఉపాధి భేదాలతో ఉన్నప్పటికీ దుష్ట శిక్షణ చేసి శిష్ట రక్షణ చేయడానికి అందుకు తగిన రూపాన్ని ఆశ్రయించవలసి వస్తుంది. ఆ విధంగా పలువురి మన్ననలు సమతుల్యంగా పొందవలసిన వ్యక్తి తప్పకుండా అరిషడ్వర్గాలనే అంతశ్శత్రువులను జయించి ఉండవలె. అటువంటి వ్యక్తులలో

అగ్రగణ్యులు బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారు.

"కర్షతి ఇతి కృష్ణః". కృష్ణుడంటే అంటే ఆకర్షించేవాడు అని అర్థం. అందులోనూ ఇక్కడ ఉన్నది నామమాత్రపు కృష్ణుడు కాదు. వేంకట అనంత కృష్ణుడు. అంటే ఎదుటివారి పాపాలు తొలగించి సద్గుణవంతులను చేసి ఆకట్టుకునే వాడు. ఈ విషయంలో యథార్థ నామధేయులు బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారు. తమ వినయోపేత పాండిత్యాది లసద్గుణా భరణాలతో ఒకవైపు జనౌఘాన్ని ఆకట్టుకుంటూ తమ న్యాయవాద వృత్తితో దుర్జనులను భయపెడుతూ "యాదోరత్నైరివార్ణవః" అని మహాకవి కాళిదాసు ప్రవచించిన విధంగా మసలుతున్న వారు శ్రీ అనంత కృష్ణ గారు. వారు వెళ్ళి నన్ను స్తుతిస్తూ పద్యాలు వ్రాయమని ఎవరినీ అభ్యర్థించలేదు. శ్రీ అనంతకృష్ణ గారిపై అభిమానం కలవారే ప్రేమతో వచ్చి పద్యరత్నాలను బహుమతిగా సమర్పించినారు.

"పుణ్యశ్లోకస్య చరితముదాహరణమర్హతి
న కశ్చిత్తాదృశః పూర్వైః ప్రబంధాభరణీకృతః
ప్రబంధానాం ప్రబంధణామపి కీర్తిప్రతిష్ఠయోః
మూలం విషయభూతస్య నేతుర్గుణనిరూపణమ్ – ప్రతాప రుద్రీయం. 1–6,7

అన్నారు సుప్రసిద్ధాలంకారికులైన విద్యానాథులు. సద్గుణాలంకృతోపేతుడైన నాయకుని స్తుతిస్తూ కావ్య రచనగావిస్తే అటువంటి నాయకుని కారణంగా కావ్యానికి, దానిని రచించిన కవులకు కూడ కీర్తి లభిస్తుంది. అటువంటి కావ్యమే బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారి షష్టిపూర్తిమహోత్సవ అభినందన సంచిక.

"ప్రజ – పద్యం" సమితి వారు ఇది వఱకు పద్య రచనపై పోటీలను

నిర్వహించినారు. ఇది పద్యకవితాస్పర్ధ కానప్పటికీ నిజమేమిటో తెలియనివారికి ఇందులోని పద్యకవులందరూ శ్రీ వేంకట అనంత కృష్ణగారిపై తమ అవ్యాజానురాగాన్ని చూపడంలో పోటీపడినా రనిపిస్తుంది. అది సమంజసమే. ఎవరికైనా సజ్జనస్తుతికన్నా మరొకటి కావలసిన దేముంటుంది. అందుకే ఈ సంచికనేర్పరచిన కవులంతా శ్రీమదనంతకృష్ణ గారిపై కవితామృతాన్నే కాక ప్రేమామృతాన్ని పంచినారు.

"అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసామ్
ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకమ్ "
ఇతడు నా వాడు - ఇతడు పరుడు అనే ఆలోచన నీచులకు మాత్రమే ఉంటుంది. "వసుధైవ కుటుంబకమ్" దేశంలోని ప్రజలంతా తన ఇంటికి చెందినవారే అనే ఆలోచన శ్రీ అనంతకృష్ణ వంటి ఏ కొందఱికో ఉంటుంది. అందుకే వారు స్తుత్యర్హులు.

శ్రీ అనంతకృష్ణ గారిని చూసిన వారికెవరికైనా వీరు అరువది సంవత్సరాలు దాటిన వారా అనే సందేహం రాక మానదు. అందుకే -

కం. అరువది దాటినవనుచును
సరిగానే జెప్పినార, సరిసరి జూడన్
మరితెల్లజుట్టు యొక్కటె
ఇరువది గాదనుచు జెప్పు నితరముకన్నన్

అని శ్రీ గోలి హనుమచ్ఛాస్త్రి గారు తమ సందేశాన్ని వెలిబుచ్చారు. ఇందులో అలంకారౌచిత్యం వ్యక్తమౌతున్నది. ఈ పద్యాన్ని పరిశీలిస్తే శ్రీ గోలి శాస్త్రిగారు నిజంగానే ముగురమ్మల మూలపుటమ్మ స్తన్యాన్ని గ్రోలి ఉంటారని అవగతమౌతుంది. అందుకే వారి ఇంటి పేరు కూడ సార్థక నామధేయమైంది.

ఇక చెప్పాలంటే బ్రహ్మశ్రీ చింతా రామక ృష్ణా రావు గారి గర్భకవిత్వం రసవద్గుణాలంకార భూయిష్టమై ఎవరూ అందుకోలేనంత ఉన్నత స్థాయిలోనున్నది. అందువలన వారి కవిత్వాన్ని గుఱించి ప్రత్యేకంగా చెప్పనైతిని.

"తిరుగు నూళ్ళను.నడువడు. పరుగులిడును, అరువదేడులన్నది మేనికే గాని మనము శిశువు గాను మారు మరల" అనే శ్రీ వీ.ఆర్.గణపతి గారి పద్యపాదాలను పరిశీలిస్తే అది యథార్థమంటూ శ్రీ అనంతకృష్ణ గారు యశోద – క ృష్ణ చిత్రంలో బాల్యచేష్టలతో అలరించే బాలకృష్ణుడై కనిపిస్తారు. "మొగముపై చిరునవ్వు మొలకలే యగుపింప – బొమముడి వేయని విమల గుణము తనగొప్పదనము మిత్రునకు జెప్పుట మాని – మిత్రుల మెచ్చెడు మేటి గుణము" అంటూ శ్రీ ధనికొండ ప్రసాద్ గారు శ్రీ అనంతకృష్ణ గారి నిప్పులాంటి నిజమైన గుణాలను యథాతథంగా వర్ణించినారు. నిప్పులాంటి అని ఎందుకన్నానంటే అగ్ని పవిత్రతకు చిహ్నం. వెలుగునిస్తూ అవసరమైనప్పుడు భయాన్ని కూడా గొల్పుతుంది. అటువంటి సద్గుణాలలవడవలెనంటే పూర్వజన్మ సుకృతమో నేటి జన్మ తపఃఫలమో మిక్కుటంగా కావలె.

కం. సర్వోన్నతుడౌ జ్ఞానిగ
బర్వియు దానంతరాత్మ బసివాడగు మా
శర్వాణీ సుతు గొల్చెద
గర్వంబొక్కింత లేని ఘన చారిత్రున్

అని శ్రీ పట్వర్ధన్ గారు శ్రీమదనంత కృష్ణ గారిని స్తుతించారు. ఎదిగినంతా ఒదిగియుండే గుణాన్ని శ్రీ అనంతకృష్ణ గారినుండే నేర్చుకోవాలి. శ్రీ పట్వర్ధన్..యం.వీ. గారి ఇటువంటి పద్యాలు బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారిపై అనురాగాన్నే కాక భక్తిరసాన్ని కూడ వర్షిస్తున్నాయి. అలాగే ఈ గ్రంథరాజములో శ్రీ హరి. వీ.య.స్సెన్. మూర్తి గారి పద్యాలు

అమృతధారాపాతము. పదాల పొందిక అజరామరము. గీర్వాణాంధ్ర భాషలపై హక్కుతో పద్య ధార నల్లేరుపై బండి నడక వలె సాగినది. బ్రహ్మశ్రీ కొరిడే.విశ్వనాథ శర్మ గారు సంస్కృత వృత్తములలో రచించిన అభినందన పద్య పంచరత్నములు న భూతో న భవిష్యతి అన్న చందాన భావామృత నిష్యందమై విలసిల్లుచున్నవి. శ్రీమతి ఆకుండి శైలజ గారి పద్యాలు సుధాధారలనొలకిస్తున్నాయి. మాన్యశ్రీ కంది శంకరయ్య గారి పద్యాల కూర్పు అలవోకగా మాట్లాడుతున్న తీరులో ఉండి రసనిష్యందమై రంజింపజేస్తున్నాయి. వారు పద్యవిద్యకు గురువులనుటకు తార్కాణంగా వెలుగొందుతున్నాయి.

ఇది వఱకు వక్కాణించినట్లుగా ఈ సంచికలోని పద్యాలు పోటీ కొఱకు పంపినవి కావు. కావున ఫలాన వారి పద్యాలు బాగున్నవని మరికొందఱివి మరో రకమని తరూచి చెప్పుట సమంజసం కాదు. ఇందులో ప్రారంభాభ్యాసదశలో ఉన్న వారిని మొదలుకొని చేయితిరిగిన పండిత ప్రకాండుల పద్యాల వఱకు ప్రతి ఒక్కరి పద్యాలు మరల మరల చదవాలనే తలంపు కలుగజేస్తున్నాయన్న మాట ముమ్మాటికీ నిజం.

ఓ కాలం నుండి తెలుగు నేలపై అభినందన సంచికలు వెలువడుతున్నప్పటికీ ఇటీవలి కాలంలో సంచికలు అధికమైనాయి. కానీ ప్రజ – పద్యం వారి నిర్వహణలో కేవలం ఛందో బద్ధమైన పద్యాలతో వెలువడుతున్న ఈ షష్ట్యబ్ద పూర్త్యుత్సవ సంచిక అగ్రగణ్యమైనది. ఒకరి కావ్యాన్ని ప్రత్యేకంగా చదివితే ఆ కవి శైలి మాత్రమే పాఠకుడు గ్రహించగలుగుతాడు. అందులో కొంత వఱకు మాత్రమే నేర్చుకొనుటకు సాధ్యమౌతుంది. అనేకమంది కవులు ఒక్క గ్రంథంలో ఇలా తమ పద్యాలను పొందుపరచడం వలన పఠితృహృదయం రసరంజకమగుటయే కాక “భ్రమరకీట న్యాయము” నందు కీటకము గూడా భ్రమరమైన రీతిగా పాఠకులనేకులు కవితాశక్తిని పొందగలరు.

గురుదేవులు బ్రహ్మశ్రీ చింతా రామకృష్ణా రావు గారు సమయాభావం వలన ఈ గ్రంథాన్ని నాకు పంపి దోషసవరణగావించి గ్రంథ సమీక్ష చేయవలసినదిగా తెలిపారు. ఈ గ్రంథంలో మహామహులైన కవివర్యులెందఱో తమ అమూల్య కవితామృతాన్ని ఆవిర్భవింపజేసినారు. అటువంటి వారి కవితామృతాన్ని పునఃపునః ఆస్వాదించే అవకాశం నాకు దక్కినది. అభ్యాస దశలోనున్న కొందఱు షష్ఠిపూర్తి అని వ్రాసినారు. షష్ఠి కి షష్టి కి భేదముంది. షష్ఠి అంటే ఆరు. షష్టి అంటే అరువది. అలాగే ఒకచోట అభినుతించ వచ్చె సభికులెల్ల అనే పద్యపాదం కనిపించినది. "సభికో ద్యూతకారకః" అని అమరకోశము తెలియజేస్తున్నది. సభికులంటే జూదమాడే వారు. "సభాసదః సభాస్తారాః సభ్యాస్సామాజికాశ్చ తే" అని అమరము. సభ్యులు, సభాసదులు మున్నగునవి అందుకు పర్యాయపదాలు. ఇలా ముద్రణదోషాలు, అక్షర స్ఖాలిత్యాలు, యతి సవరణలు చేయవలసిన చోట సవరించవలసి వచ్చినది. సహృదయులైన కవులు ఇందుకు సహకరించెదరని తలుస్తున్నాను.

నాకీ అవకాశమిచ్చిన గురువర్యులు బ్రహ్మశ్రీ చింతా రామకృష్ణా రావు గారికి, మఱియు బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారికి సవినయ దండప్రణామములనంద జేస్తున్నాను. "నోరు మంచిదైతే ఊరు మంచిదౌతుంది" అని ఒక మంచి నానుడి. నారుమంచి వారి నోరు మంచి. కావున వారికి ఊరొకటే మంచియగుట యేమి? విశ్వమే మంచి. అందుకే వారు తమ వృత్తిప్రవృత్తులతో వినువీధిలో సంచరిస్తూ "ఇందుగలడందు లేడని" అన్నట్లుగా ఎల్లప్పుడూ అందరికీ అందుబాటులో ఉంటారు. వారి షష్టిపూర్తి మహోత్సవసంచిక అజరామరమై అందరి కరతల సరోజములయందు అలరారగలదని ఆశిస్తున్నాను.

ఇట్లు

బుధజన విధేయుడు

**డా॥ మాడుగుల అనిల్ కుమార్**



# కృతజ్ఞతాంజలి

శ్రీ నారుమంచి వేంకట అనంతకృష్ణ గారు సత్కవి. సహృదయులు. విశేషించి ప్రజ–పద్యం ఫేస్ బుక్ ద్వార వారు పద్యానికి చేస్తున్న సేవ ఎనలేనిది. పద్యం సమాజానికి వినియోగించబడాలన్న సదుద్దేశ్యంతో వారు ఎందరో యువకవులూ,కవయిత్రులకు మార్గదర్శనం చేస్తున్నారు. అనంతకృష్ణ గారు ఎక్కడ ఉంటే అక్కడ ఉల్లాసం,ఉత్సాహం,ఉత్తేజం –ఈ మూడూ విధిగా ఉంటాయి. పెద్దల్లో పెద్దవాడిగా ఎదిగిపోవడం,పిల్లల్లో పిల్లవాడిగా ఒదిగిపోవడం వారి సహజ స్వభావం. ఈ లక్షణమే వారి నందరికీ ఆత్మీయులను చేసింది. వారి షష్టిపూర్తి సందర్భంగా ప్రజ పద్యం మిత్రులు తమ ఆత్మీయాభిమానాలను చాటుకొని సమర్పించిన పద్య సుమహారమే ఈ "అమ్మ దయ". వారి నిలువెత్తు గుణగణాలకు విలువెత్తు ప్రేమ నీరాజనం. వారు దేవీ ఉపాసకులు. అమ్మ పట్ల అచంచల విశ్వాసం.ఏం జరిగినా " అమ్మ దయ"మాత్రమే అనడం వారి సన్నిహితులందరికీ ప్రత్యాక్షానుభవమే. అందుకే ఈ ప్రత్యేక సంచికకు "అమ్మ దయ"అనే పేరు అక్షరాలా సరిపోయింది.

ఈ సంచికను తీసుకొని రావడానికి చొరవతీసుకొన్న ఆంధ్రామృతం బ్లాగ్ నిర్వాహకులు , చిత్ర,గర్భ కవిత్వ విశారదులు శ్రీ చింతా రామకృష్ణారావు గారికి ప్రజ పద్యం గ్రూప్ ఎడ్మిన్స్ పక్షాన ప్రత్యేక నమోవాకాలు. వారి సంకల్పబలమే ఈ సంచికను వెలువరించడానికి ప్రత్యక్ష కారణం. ప్రజ పద్యం గ్రూపులో అనంతకృష్ణగారి షష్టిపూర్తి ఉత్సవాలకు పద్యాలను వ్రాయించడం దగ్గరనుండి ఈ సంచికను వెలువరించడం వరకూ ఆయా సందర్భాల్లో వారి అనన్యసామాన్యమైన కృషి అభినందనీయం.ఆయా కవుల పద్యాలను అవసరమైనచోట్ల పరిష్కరించిన ఆచార్య అనిల్ మాడుగుల గారికి , తమ అభిప్రాయాన్ని అందించి ఈ సత్ప్రయత్నాన్ని ఆశీర్వదించిన పెద్దలు శ్రీ కొరిడె విశ్వనాథశర్మ గారికి మా కృతజ్ఞతలు.

ఇక చివరగా అనంతకృష్ణగారి మీది అభిమానంతో స్వచ్ఛందంగా ఈ సంచిక కోసం, హార్దిక ఆర్థిక సహాయాన్ని అందించిన కవులూ,కవయిత్రులందరికి సవినయంగా ధన్యవాదాలు.

**"పచ్చని పద్యాన్ని ప్రేమిద్దాం"** ప్రజ–పద్యం **(లోకాస్సమస్తాస్సుఖినోభవంతు)**



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# చింతా రామకృష్ణారావు గారు

**బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంతకృష్ణ వనజ దంపతులకు**
**తేదీ. *25 - 12 - 2017* షష్టి పూర్తి సందర్భముగా సమర్పించిన**

## నవరత్నమాలిక

శా. శ్రీ జ్ఞానాశ్రయ భాగ్యదాయినిని, రాజీవాక్షి నా శాంభవిన్
జిజ్ఞాసిన్గని నారు మంచికగు యీ శ్రీ షష్టి పూర్తిన్, ప్రభల్
సుజ్ఞేయంబుగ గొల్పగా నిచటికిన్ శోభాయమానంబుగా
విజ్ఞుల్ మెచ్చగ వచ్చి దీవన లిడన్ వేమారు నే గోరుదున్ . 1

శా. సుబ్రహ్మణ్య సరోజనీ పితరులన్ శోభింపగా జేయగా,
సుబ్రహ్మ ప్రపితామహున్ తనుపగా శుంభద్గుణోద్దిష్టుడై,
శ్రీ బ్రహ్మంబు కనన్ బితామహులు నా కృష్ణయ్యలక్ష్మమ్మలున్,
ధీబ్రహ్మంబుగ నారుమంచి వెలసెన్, దివ్యుండనంతుండుగా 2

మ. వనజాతాయత నేత్ర భార్యగ క్షితిన్ భాసింపగానొప్పుచున్,
ఘనతన్ వెల్గు నపర్ణ కూతురవగా, కాన్ మూర్తి జామాతగా,
వినుతిన్ గౌశికు బుత్రుడున్, శ్రుతిమహద్విఖ్యాతయౌ కోడలున్,
మనుమండున్, తగు మన్మరాండ్రు కలుగన్ మాన్యుండుగా వెల్గిరే 3

శ్రీచక్ర బంధ తేటగీతి.

కనుత మిమ్ముల శ్రీమాత కాంతివంత -
లక్ష్మీమీడేర్చు సుశ్రీ విలాస రసిక
సిరులు పండించు శ్రీవిద్య చేరి బ్రోచు -
కమల వాసిని తప్పక కాచునింక. . 4

చ'తురంగ' స్వస్తిక్ బంధ కందము.

మృదు మధుర శుభ భరిత వర -
బుధనుత వచస! వినుమయ విపుల దయ కలిమిన్.
సదమల కలుములు కలుగు నె -
దద, భరిత సుచరితుడ! శుభుడ! కనుమయ భువిన్. 5

ద్విపద ద్వయ, మత్తకోకిల గర్భ సీసము.

శ్రీపరాత్పరి నెంచి చేతువు సేవ ని -
త్యమనంతుడా నీవు తత్వ ఖనివి.
దీపితంబగు భక్తి తేజము దేవతల్ -
గణియింపగా వచ్చు కరుణ చూప.
ప్రాపు శాంభవి భావ రమ్యుడ భక్త దీ -
పిత నీకిలన్, భాగ్య తతినొసంగు.
శ్రీపదాశ్రయ వెల్గు శ్రీపద చింతనా -
మృత ధారగానింక క్షితిని సతము.

తే.గీ. సత్య సంపన్న జీవన సాక్షివగుచు -
నిత్య మానంద సామ్రాజ్య నేతవగుచు,
స్తుత్య జీవన భాగ్యసంశోభివగుచు -
షష్టి పూర్తిని గనుమ సంతుష్టి నీవు. 6

చ. ప్రగణిత సత్య సంభవిత భాస్కర తేజ ! యనంత కృష్ణుడా !
జగతిననంతతేజమగు సంస్తుత శాంభవి నీదు రూపునన్
సుగుణ చయంబు పెంచుత వసుంధర భారతి కీర్తి పెంచుతన్.
నిగమ సువేద్యు నద్భుత మనీషులలో వరలింప జేయుతన్. 7

నక్షత్రబంధ శార్దూలము.

(కోణములందు) రాముండేలుత (కేంద్రములందు) నినసంతుడ
టనిన్ అనంతుడ ( ఓ అనంతకృష్ణా నిన్ను రాముడు పాలించుగాక
అను భావ గోపన చిత్రము )
రానా రాఘవ! ధీ నిధిన్ గనర, నార్మంచీతడే దేవరా!
జ్ఞానానందుని, తుల్య పూర్ణుని, నుత క్షాంతున్, గృపం జూడరా!
జ్ఞానిన్ బ్రోవర నీవు ముందుగను సుజ్ఞాన ప్రదా నంద! రే
డా! నీవేలుమనంతు పండితుల నీడన్ జ్ఞాన శోభస్కరా! 8

మ. పరమోత్కృష్టము షష్టి పూర్తి. మిములన్ వర్ధిల్ల జేయున్. శుభా
కరమై వంశ వివృద్ధి జేయు, మహితాకాంక్షల్ ఫలించున్ మహ
ద్వరమై వర్ష శతంబు నిల్పు మిములన్ ప్రజ్ఞాన సంపూర్ణతన్.
ధరపై మంగళ మూర్తులై శుభములన్ దర్శించుడీ సత్కృతిన్. . 9

మంగళమ్ మహత్

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

## కోటవేంకటలక్ష్మీనరసింహం గారు, సహస్రావధాని

చం. అరువది వత్సరమ్ములు మహాద్భుత రీతిని ధర్మమార్గమే
కరమను రక్తితో వనజ కైగొని లక్ష్యముగా గమించి సం
బరముగ చేరినట్టి ఒక భవ్యచరిత్రు ననంతకృష్ణు నే
ర్పరి నిటుమెచ్చి పల్కెద శుభప్రతిపాదన మున్నుచేయుచున్

చం. ఇరువది నాల్గుగంటలొక ఇంచుక చాలవు నిత్యకృత్యముల్
సరిగ జనమ్ము మెచ్చగ ప్రశస్తముగా నొనరింప మాకహో
ధరణిని నీవలెన్కవన తత్త్వమువృత్తి మహత్త్వము స్వరా
త్పరి పదసేవనమ్మమర భాషను నేర్చుట చేయగల్గిరే

సీ. న్యాయవాదమ్ముతో నలుగురిమేల్గోరి
వ్యవహరించును జనుల్పరవశింప
పుస్తక పఠనమ్ము మోదమ్ముతో చేసి
సారమ్ము వచియించు సరసులకును
కమనీయ భావాల గ్రంథపంక్తిని వ్రాసి
ఆవిష్కరించు సభాంతరముల
దేవభాష యటన్న తీపి బాసేయంచు
నయముతో సంభాషణములు సలుపు

తే.గీ. ఫేసుబుక్కున కామెంట్లు విరగదీయు
ప్రజయు పక్షమ్మటంచును పద్యములను
లక్షలాదిగా రాబట్టి దీక్షతోడ
తెలుగు భాషామతల్లికి దీప్తిపెంచు

శా. బాలా పాద సమర్చనా నిపుణ శోభాయుక్త సంశోభితా
లాలిత్యాద్భుత భావబంధుర వచోలావణ్య సంజీవనా
బాలేందుద్యుతి కాంతిసంగత పరబ్రహ్మ ప్రభా భావుకా
మాలల్వేసి అనంతకృష్ణని నుసంభావింతునే ప్రేముడిన్

ఆ.వె. షష్టిపూర్తివేల శారదపార్వతి
శ్రీయు వారివారి ప్రియుల తోడ
వచ్చి నీ కుటుంబ వర్చోభివృద్ధికి
ఆశిషమ్ములిడగ ప్రాంజలింతు

ఆ.వె. కోటిరూప్యమ్ము లిడలిడలేని కోట వీడు
అక్షరమ్ముల మాలికలల్ల గలడు
నీదు హృదయాన ప్రేమ సందీప్తి నింప
చేరి నిలిచెడి శ్రీనరసింహ మితడు

# మద్దాలి శ్రీనివాస్ గారు

**శ్రీ అనంత కృష్ణ గారి షష్టి పూర్తి సందర్భముగా**
**ప్రేమతో నేను సమర్పించు కొనిన పద్యరత్నములు.**

సీ. ఆత్మీయుడాతడౌననవద్య పద్య ప్ర
తుండుభయ కవి మిత్రుండు ఘనుడు
సోదరుడందరి శుభమును గోరెడి
యాత్మ బంధువు తాననంతుడతడె
మా పాప తమ్ముడు మాకునబ్బాయట
మా తండ్రియును తానె మా సుకృతము
గౌరవింతుము మేము గారాబమును చేయ
సంతసమగు మాకు సత్కృతమగు

ఆ. నిత్య నిర్మలుండు నెమ్మది తో బల్కు
నతని మాట వెన్న యతడు వెన్న
ప్రోత్సహించు నెపుడు పుత్ర వాత్సల్యతన్
అతని మించు నతడెనన్నిటందు.

కం. పొదుపుగ భాషించు నతడు
నెదకు న్నెమ్మదిని గూర్చు నెప్పుడు బ్రేమన్
బొదవుచు బలుకుట తన గుణ
మది యపురూపంబు పృథ్వి నరుదుగ మెఱయున్

ఆ. అతని పలుకులందు నమ్మ తా కొలువుండు
నతని యాత్మ యందునామె యుండు
నెపుడునమ్మచింతనతని మదిని యాడు
నతని రూపమదియు నమ్మ రూపు

కం. సభలను కడు నేర్పున వా
గ్విభవముతో నెఱపు చుండు విజయ పథములో
శుభమును శాంతిని చేకూ
ర్చి భళి యనుచు జనులు మెచ్చ సిరులును గలుగన్

శా. ధీరుండెన్నడు క్రుంగు పొంగులకు నేతీరందతీతుండు తా
నారాధించును పద్య విద్య నెపుడున్నానా విధానంబులన్
గోరండెన్నడు పేరు గొప్ప లవనిన్ గూర్మిన్ విచారించు నా
త్మారామున్ విధిగా సదా నిలుపుచున్ దాదాత్మ్య తల్లీనుడై.

## యర్రమిల్లి బావాజీ గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణా వనజల షష్టి పూర్తి సందర్భముగా సమర్పించిన అభినందన మందారమాల.***

కం. శ్రీకారంబగు మీకును
ప్రాకారంబైన యట్టి ప్రాజ్ఞతనిండన్
ఓంకార స్వర రూపిణి
హ్రీంకారాసని, భవాని యిడగను సిరులన్ !!

కం. బహుముఖ ప్రజ్ఞావంతుడు
బహుభాషా కోవిదుండు బహు విజ్ఞుండున్
సహచర సాదర శీలుడు
సహనమునకు మారుపేరు చక్కని కవియున్ !

కం. అరవై నిండిన బాలుడు
అరవెయ్యేళ్ళుండు గాత!యమ్మ సుదయతో
యిరవైల శక్తి తోడను
యిరవుగ మా మనము లేలు నీశుని కృపతో!!

కం. సందడి జేతువు సభలో
సందర్భోచిత వ్యాఖ్యల సవ్వడి తోడన్
డెందము చిందులు వేయును
అందరి యాదరము నొప్ప ననంత కృష్ణా!

కం. అందరి కిష్టుడ వీవెగ
అందరినీ పలకరింతు వానందముగన్
అందరి మన్నన లందెదు
వందరి తలలోని నాల్క వనంత కృష్ణా!!

ఆ.వె. ప్రతిభ నడుపు దీవు ప్రజపద్య కూటమి
పటుతవర్ధన,గణపతులతోడ
సర్వజనుల సుఖము సామాజిక న్యాయ
పద్య సుధల జిలుకు పరమ హంస!!

ఆ.వె.కవుల యందు నెంతొ కవన స్ఫూర్తిని నింపి
ముచ్చటైన యాణి ముత్యములను
పంచి నారు మంచి ప్రజ పద్య వేదిన
మంచివారు నారుమంచి వారు!!

ఆ.వె.కలము తోడ మంచి కవితల నల్లుచు
కొలను నంత తమ్మి పూలనింప
పంపె నిలకు తాను పరవశమ్మగు రీతి
నలువ రాణి మిమ్మ నంత కృష్ణ!!

ఈశా!భక్తకల్పద్రుమా!!సరదాకేసుమా!!!

ఆ.వె. క్రిష్ణుడన్ననతడె క్రీస్తుయన్ననొకడె
యనుచునుండిరిపుడు యవనిజనులు
మంచి మూర్తమనియొ మతసామరస్యమో
క్రిష్టమస్సునాడె షష్టిపూర్తి!!!

## బల్లూరి ఉమాదేవి గారు

**శ్రీమాన్ నారుమంచి వేంకట అనంత కృష్ణ వనజ దంపతులకు**
**షష్టిపూర్తి సందర్భముగా సమర్పించిన నవరత్నమాలిక**

ఆ.వె: శ్రీనివాసుని దయ శ్రీసౌఖ్య దాయియై
వెలయు గాక మీకు విశ్వమందు
శారదమ్మ మీకు శాంతి స్వస్థతలాయు
వొసగి కాచు గాక యుర్వి పైన.

ఆ.వె: పుష్య శుద్ధమందు పుట్టెను పూజ్యుండు
సప్తమి తిథి యందు జగతిలోన,
కన్నవారికితడు గారాల బిడ్డడై
యెదిగి యొదిగి నాడు ముదము గూర్చ.

ఆ.వె: అంతు లేని దైవ మాయనంతుని పేర
జగతి వెలసినట్టి సాధువీవు
మిత్రులిరువురి గని మేలైన పోటీలు
నిర్వహించి కవుల నెన్ని నావు.

ఆ.వె: న్యాయవాది వీవు నగరజీవనమందు
హృద్యమైన పద్య విద్య యందు
నారి తేరినట్టి యాధునిక కవివి
నిన్ను పొగడ తరమె నిరుపమాన!

ఆ.వె: ఆరుపదుల వయసు నానందమున దాట
షష్టిపూర్తి జరుపు సంబరములు
జరుగు చున్న వవిగొ జగతిలో గాంచుచు –
నభినుతింప జేరనార్యులెల్ల.

ఆ.వె: కవులచేత నిచట కమనీయముగ నీవు
నరువదేసి పద్దియముల మిగుల
ముదము గలుగునట్లు పూజ్యుడా! వ్రాయించి
ఘనత పెంచినావు కవులకెల్ల.

ఆ.వె: సవ్యసాచి వోలె సకల కార్యంబుల
నాచరించు చుందు వవని యందు
తనువు కయ్యె వయసు మనసుకు కాదని
యెఱిగినట్టి ఘనుడవీవనంత!

ఆ.వె: ఆలుమగలు పుడమి నాదిదంపతులట్లు
హర్షమమర బ్రతుకు డనవరతము
పూజ్య దంపతులుగ, పుత్రపౌత్రులతోడ
శుభములందుడయ్య శోభనాంగ!

ఆ.వె: శ్రీల నొసగు తల్లి శ్రీలక్ష్మి సతతము
కొలువుదీరుగాక కూర్మితోడ
ననవరతము మీకు నానంద సందోహ –
ముల్లసిల్లుగాక తల్లి దయను.

# చొప్పకట్ల సత్యనారాయణ గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంతకృష్ణ వనజ దంపతులకు.***
***షష్టి పూర్తిసందర్భముగా సమర్పించిన అభినందన పద్య పంచకము.***

క. కవితాలంకృతవిద్వ
త్కవితాజిత సర్వహృదయ కామిత జనతా
సువిశాల యశోవిరాజిత
కవిరాజా! జయము నీకు గైకొనుమిలలో!

క. నీమాటేపద్యంబై
నీ మాటే వేదమగుచు నిగుడుచు నెపుడున్
నీ మాట లోకహితమై
నీమించుత జనముమెచ్చ నిఖిలార్ధంబుల్!

ఉ. కామిత సర్వలోక ఫలకారకుడై కమలాప్తుడై ముని
స్తోమము సన్నుతుల్సలుప శుభ్ర గభీర వనాంతరంబునన్
ప్రేముడి సప్తశైలముల వేలుపుగా నుతికెక్కువాడిలన్
శ్రీమదనంతకృష్ణవరు సేమము మీరగ గాచు గావుతన్ !

చం. అరువదివత్సరాల యరుదారు వయస్సున పూర్ణకాముడై
మురిపెము మీర సత్కవుల మోదతోడుత నాదరించుచున్
అరుదగు యక్షరార్చన నపార ముదంబున నిర్వహించు భూ
సురవరు గాచుగావుతను బొల్పుగ సాయి కృపాకటాక్షముల్.

తే.గీ. అరువదేడులు నిండిన యవనిసురుడు,
సంస్కృతాంధ్రముల్ నేర్చిన సవ్యసాచి,
కవులపాలిట చక్కని కల్పతరువు,
ఘనుడనంతుని కృష్ణుని గాచుగాత!

# వాడపల్లి రాధ గారు

**పూజ్యులు అనంత కృష్ణ గారికి నా పద్య పూమాల.**

ఉ: శ్రీ రమ సంపదిచ్చి శుభ శ్రీయుతమై తనరార జేయగా,
గౌరియె సర్వవేళలను గౌరవమందగ జేయుచుండగా,
శారద వారి వాక్కునను శాశ్వతమై కొలువుండ నిండుగా,
చేరి యనంత కృష్ణునకు 'జే'యని యెల్లరు పల్క జూడమే !

ఉ: మెచ్చ ననంత కృష్ణునకు మేలుగ నర్వది యేండ్లు నిండగా,
వచ్చిరి పుత్ర పౌత్రులును వారికి పండుగ జేయ వేడుకన్ !
హెచ్చుగ బంధు మిత్రులును హేలగ జేరిరి ! వారి యింట నే
నచ్చిన రీతి జేయుదురు, నాణెములైన విశేష యాగముల్ !

ఉ: విద్దెల మేలుబంతి గద, విస్తృతమైనది వారి ఖ్యాతి యే
కొద్దిగ జూప నా ప్రతిభ కోరిక గల్గెను, మానసమ్ములో
పద్దెము వ్రాయబూనితిని, పాదములంటుచు శారదా సతిన్
వద్దనకుండ నా పలుకు వారిని జేరుత వాణి తోడుగా !

ఉ: విన్నపమొక్కటున్నదిగ, వీనుల జేరగ వేల్పులందరున్
మన్నన జేసి దీవెనల మానితసంపదలీయ గోరెదన్,
చిన్ని యనంత కృష్ణునకు చిక్కగజేయుదు నాదరమ్ముగన్,
వన్నెలు తగ్గకుండ మరి వాదన జేయు పటుత్వ మెప్పుడున్ !

చం. అరువది యేండ్లు వచ్చినను యా రఘురాముని రీతి వెల్గుచున్
కరుణను జూపుచున్ మరియు కాదనకుండ సహాయమిచ్చుచున్
బరగు ననంత కృష్ణునకు భారముగాక మరిన్ని యేండ్ల నా
వరదుడు వేంకటేశ్వరుడు వారికి దీర్ఘమునాయువిచ్చెడున్ !

# కొమ్మోజు శ్రీధర్ గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారికి***
***తేదీ. 25. 12. 2017 న షష్టి పూర్తి మహోత్సవమును జురుగుచున్న***
***సందర్భముగా సమర్పించిన పంచరత్నములు.***

ఆ.వె. అరువదేండ్లవాడు అక్షరాలకు ఱేడు
పద్య కవిత సుధను బంచు వాని
షష్టి పూర్తినాడు సంబరములు జేయ
కదలి వచ్చె సరసకవుల దండు.

ఆ.వె. తృష్ణ దీర్చు వాడు కృష్ణుడతని పేరు
కలము బట్టినంత కవితలూరు
సందియములు దీర్చు సచ్ఛీలసంపన్ను
సంబరములనాడు సన్నుతింతు.

ఆ.వె. ఆతడడ్వొకేటు, యడ్మిను గ్రూపుకు
ఈతనేర్పు మనకు కైతకడలి
కలము బట్టి యతడు కవితలు వ్రాయంగ
నన్నయవలె తోచు నారుమంచి.

ఆ.వె. కృష్ణుడన్ననో మరి యనంత యననేమి
అంత తానె యగును ఆదరించ
తృష్ణ యున్న చాలు విష్ణువై వరమిచ్చు
కవితలన్ని దిద్ది కలత దీర్చు.

ఆ.వె. కవితలల్లుటందు కవిరాజు కృష్ణుడు
బంధుజనులకేమొ బాంధవుండు
కవులకెల్లనతడు కనిపించు దైవమ్ము
సరసులందు గొప్ప సరసుడతడు.

# మంథా భానుమతి గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారికి***
***తేదీ. 25. 12. 2017 న షష్టి పూర్తి మహోత్సవమును జురుగుచున్న***
***సందర్భముగా సమర్పించిన పంచకందాల మాల.***

కం. శ్రీ వాణి కృపను కురియుచు
కావగ సతతము ననంత కవితల నల్లన్
చేవగ పలు శతకములను
తావుగొని రచింపగల్గు ధన్యుడవయ్యా.

కం. చెదరని చిరునగవు నెపుడు
వదలక నిలుపగనె నిలుచు వదనమునందున్
పదముల పదుగురికి పనిచి
విదునొసగ నొక దరికి పొదుపె ననంతుడుగా.

కం. పద్య కవులకొక వేదిక
హృద్యముగన్ పాదుగొలుప హృష్టిగనే తా
వేద్యమున శ్రమించగనే
సాధ్య పరచె నారుమంచి సహృదయత ననున్.

కం. పలువురి కవితల పొత్తము
వెలి దీయగ పవలు రేయి వెతల బడగనే
కలనైన కలత చెందక
చలచల్లగ కృష్ణుడెపుడు చనుదెంచు గదా!

కం. సతతము చతురోక్తులతో
మితి మీరక సన్నిహితుల మేలును కోరన్
హితుడౌ ననంత కృష్ణకు
శతమానం భవతి యనగ చనెదము రారే

# అన్నపరెడ్డి సత్యనారాయణ రెడ్డి గారు

**బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారికి**
**తేదీ. 25. 12. 2017 న షష్టి పూర్తి మహోత్సవమును జరుగుచున్న**
**సందర్భముగా వారికి ఆయురారోగ్యైశ్వర్యాలు కలగాలని**
**కోరుకుంటూ సమర్పించిన అభినందన నవరత్నమాలిక**

తే: శ్రీనివాసుడే జనియించె జ్ఞాన ఖనిగ
రాయలను పేరున మొదట రాజుగ మరి
నారుమంచి వేంకట కృష్ణ నామమునను
తెలుగు భాషకు జగతిలో వెలుగు నింప. 1

తే: న్యాయ శాస్త్రము చక్కగానభ్యసించి
చక్కని ప్రతిభ జూపుచు, సాదరముగ
పద్యవిద్యకు తన మది పదును బెట్టి
వ్రాసె పలుపద్యముల గడు రంజుగాను. 2

తే: భవుని పైననంతమౌ భక్తి, నీశ
భక్త కల్పద్రుమా యంచు బరగ వ్రాసె
శతకమొకటి యిచ్చు మదిలో నతిశయింప
పదుగురు ప్రశంస లందింప ప్రతిభజూసి. 3

ఉ: పద్యము భూమిపై వెలుగ ప్రాభవమున్ గొని దీక్షతో ప్రజా
పద్యమటంచు నేర్పరచి బాసటకైకొని సంగడీల తా
హృద్యముగా లిఖించు దిశ నింపుగ జూపెను క్రొత్తవారికిన్
వేద్యుడనంతకృష్ణ, హరి వేడెద వారికి నివ్వ సౌఖ్యముల్ 4

తే: గురువు వలె పద్యములకు సవరణ సలిపి
క్రొత్త కవులను ప్రకటించి కూర్మి తోడ
సత్కృతములను సల్పి తా సాదరముగ
భోజనమొసంగి కరమగు ముదముతోడ
మన్ననలనందుకొంటివి మాన్యచరిత. 5

తే: నవ్వు ముఖమందు భాగమై నాట్యమాడు
నారుమంచివారు పలుక నహరహమ్ము
హాస్యమే మనసు జయించు నాయుధమ్ము
వాణి వారికంధరమున్ నివాసముండు. 6

తే: పండితుండు కవియు న్యాయవాది సన్ని
హితుడు మానవత్వము వెల్గు చతురుడతడు
హరియె దీవెనలందించ ననవరతము
వెలుగు జీవితమ్మిలపైన కలిమి తోడ. 7

తే: ఘనుడు పట్వర్ధనుండును గణపతియును
సతము తనవెంట ద ృఢముగా సాగుచుండ
పద్యవిద్యను తాను కాపాడనెంచి
పదముల కదుపుచుండెను ముదముతోడ. 8

తే: మంగళ కరమౌ యీ సభా మండపమున
హితులు బంధువుల్ దీవించ నింపుగాను
చదలు నుండి సురలు విరుల్ జల్లుచుండ
షష్టిపూర్తి నయమ్ముగా జరుగుగాక. 9

# పద్యకవన వనం గారు

తెలుగు పద్దెముల తెరువరి శ్రీ అనంతకృష్ణ గారికి షష్టి పూర్తి సందర్భముగ అక్షరాభినందనలు.

ఆ.వె. అమ్మపాల బలము అయ్య పౌరుష మందె
మంచిమనిషి 'నారుమంచి' మణిగ
వనజగర్భవంశ వర్ధమానుండయ్యె
వనజకర్ధ దేహి భవ్యజీవి !

ఆ.వె. మమత జిల్కునట్టి 'మంచినారు'ను బోసి,
నిర్మలమనమనెడు నీరు నింపి,
తెలివి మాల్మి యోర్మి దిద్దెడు బలమిచ్చి,
ధన్యులైరి తల్లిదండ్రు లనగ!

శా. శ్రీవాణీధవళాంశరాగ మలరన్ శ్వేతాబ్జ సందీప్తులై
మీ వస్త్రమ్ముల కేశజాలముల బింబించున్ మనోధర్మమై
మీ వాదమ్ముల గెల్పు ధైర్యమిడగా మీ కంచుకమ్మంబయై
మీ వాత్సల్యము మేలుబంగరువుగా మేలిచ్చు శ్రీలక్ష్మి యౌ

ఉ. వృత్తిని న్యాయవాదులు, ప్రవృత్తిని సౌమ్యపదానురక్తులై
యెత్తుల జిత్తు చేయగల హృద్బలసంయుతు, లాత్మశక్తితో
విత్తము మించు సత్కృతుల పెక్కులనంది సువాదనాద్యుతిన్
చిత్తములెల్ల రంజిలగ జేసెడు మాన్యులనంతకృష్ణులే

మ. ప్రజ పద్యాధ్వర యజ్వగా గణపతిన్ పట్వర్ధనోద్యుక్తులై,
సుజనానీకము మెచ్చు సత్కవితలన్ శోధించి ముద్రించి, పం
కజగర్భాన్వయ దీప్తులందు కవితాజ్ఞానాబ్ధిముక్తామణీ!
విజయమ్మిచ్చుచు పద్యకాంతులును దీపించున్ యశోభాక్కులై

# హంసగీతి గారు

**_శ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారి షష్టి పూర్తి సందర్భముగా సమర్పించిన అభినందన మందారమాల._**

కం. అజ్ఞానము తొలగించుచు
జిజ్ఞాసను పెంచునట్టి శిక్షణ నిచ్చున్
విజ్ఞానమొసగు చుందురు
ప్రజ్ఞా పాటవము తోడ ప్రజపద్యములో !! 1

కం. చిరునగవు చెదరనీయరు
తరాల సంస్కృతి మరవని తమ్మి దొరలుగా
నెరవును జూపుచు నిత్యము
పరుల హితము కోరునట్టి ప్రాజ్ఞులు వారల్ !! 2

కం. పదవీ విరమణ తదుపరి
చదువుల తల్లికి పదముల స్వాగత మీయన్
మొదలిడె పద్యాంశములను
సదస్సులను నిర్వహించె సహచరుల కడన్ !! 3

కం. అరువది యేండ్ల వయస్సున
జరుపుకొనెడి షష్టిపూర్తి సంబరమొహొహొా
యిరువురి జంటను చూడగ
వరమట మనలకు వరలుదు వందేండ్లు భువిన్ !! 4

కం. అందముగా జెప్పుదు రే
ఛందములోనైన వారు చతురత తోడన్
వందల పద్యములలరగ
వందనమయ్యా తమరికి భవ్యులు మీరల్ !! 5

కం. నలుగురి మంచిని గోరుచు
నలమేని దొర తమరయ్య నామనమందున్
పలికిన పలుకులు మధురము
తెలిపిన నీతులు మరువము తెలివిని పెంచున్ !! 6

కం. ఉత్తములనంత కృష్ణుల
వృత్తములను పరిచయించు వేదిక చూపెన్
మెత్తగ పాఠము జెప్పుచు
మొత్తము పద్యములు చదువ మురియుచు నవ్వున్ !! 7

కం. చతుర్విధ కందములన
మతినలరింపగ రచించు మాన్యులు వీరల్
ప్రతి పాదములో విరుపున
సుతారముగ జూపుచుండు సుజనులు కారే !! 8

కం. సుమ హారమ్ములను మరల
కమనీయముగా ధరించు శుభదినమిదియే
రమణి వనజమ్మయె వధువు
నమతులతో పంపుచుంటి నవరత్నములన్ 9

## హరి వీ.య.స్సెన్.మూర్తి గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి అనంత కృష్ణ గారి షష్ట్యబ్ద పూర్త్యుత్సవ సందర్భమున సాదరముగా సమర్పించు పద్యసుమాంజలి***

ఉ. శ్రీమదనంత కృష్ణకవిశేఖరు, నద్భుతభావనాయుతున్,
ధీమతి, నార్య, భవ్యగుణ దీపితు, నున్నతు నెల్లకాలమున్
క్షేమకరుల్ సురోత్తములు శ్రీలను గూర్చుచు సద్యశంబు లీ
భూమినొసంగుచుండి పరిపూర్ణ మనోరథు జేయ గోరెదన్. 1

శా. ఈ షష్ట్యబ్ద సమాప్తి వేళ సుకవీ! యింపారు సౌఖ్యంబు, సం
తోషంబున్, విభవంబు, స్వాస్థ్యము, సదా తోరంపు సత్కీర్తియున్,
భాషాయోష యనుగ్రహించ సుమహద్వాక్య ప్రభావంబు, స
ద్భూషల్ మీరు నిరంతరంబుగనిలన్ పొందంగ కాంక్షించెదన్. 2

శా. నవ్యంబై వెలుగొందు తేజమున నో నార్మంచి వంశాగ్రణీ!
దీవ్యద్వైభవ యుక్తమైన కృతులన్ ధీశక్తి సృష్టించుచున్
శ్రావ్యంబైన నుతిన్ గడించి బహుధా సంతోషముల్ చూచుచున్
భవ్యంబైన సుఖంబు గాంచుడు లసద్భాగ్యార్థులై యెల్లెడన్. 3

ఉ. న్యాయమె నమ్మి బల్కుచు సదాశయ దీప్తుల నెల్లవారికిన్
శ్రేయములందజేసెడి విశిష్టత దాల్చిన సజ్జనాగ్రణీ!
శ్రీయుత! నారుమంచి కుల శీతమయూఖ!సుధీంద్ర! మీకు నా
ప్యాయత నిండ నాశిషములందగ జేయగ నంబ గోరెదన్. 4

సీ. ధార్మికత్వము నిండు నార్మంచి వంశంబు
నానందమున ముంచు జ్ఞాన ధుర్య!
సాహిత్య సేవలో సన్నుతుల్ సంతత
మందుచుండిన యట్టి యార్యవర్య!
న్యాయానుసరణంబె ధ్యేయంబుగానెంచి
భాషించు చుండెడి భాగ్యశాలి!
సల్లాప రుచితోడ సన్మిత్ర కోటికి
హాయి బంచుచునుండు హాస్యశీలి!

తే.గీ. శ్రీయుతానంత కృష్ణార్య! చిరము ధరణి
నాయురారోగ్య భాగ్యంబులందుచుండి
శుభములన్నింట గాంచుచు సురుచిరమగు
జీవనంబిట నిలలోన చేకొనుండు. 5

# మఠం శివకుమార్ గారు

**బ్రహ్మశ్రీ నారుమంచి అనంత కృష్ణ గారి**
**షష్ఠిపూర్తిమహోత్సవ శుభకామనలతో చంద్రునికొక నూలుపోగు.**

ఉ: శ్రీపతి వాక్కు శ్రీమతి సుశీల మనోహర భావదీప్తియున్
దీపము భార్యయున్ వెలుగు తేజము భర్తయు గాద! చూడ యీ
కాపురమయ్యె నందరకు కన్నులపండువ!! షష్టిపూర్తియున్
రూపసి రూపునన్ నిలిచె రోదసి నిండెను హాయిరాగముల్!!

కం: వచనము భావము పెంపున
సచనము నెమ్మియు విధమున సాగెను వీరల్
రచనకు సార్థకత వలెను
పచనంబాయె నిరువురును పదముపదమునన్!!

శా: సాహిత్యంబని తెల్గువెల్గని తగున్ చైతన్యమీ మాత్రమున్
నాహాయిన్ గనుమాయనంచు తిరుగన్ నా తల్లి స్వేచ్ఛిచ్చె!! దా
గేహంబందలి బాధ్యతంతయు కనెన్ !! కీర్తించి నే మ్రొక్కెదన్
మా హాసంబును పెంచినట్టి తలికిన్ !! మమ్మున్ సదా చూచు తా!!

ఆ.వె: ఆదిదంపతులను మేదిని లోజూచు
పరమభాగ్యమిద్ది పర్వమిద్ది
యిహము పరము దక్కెనిలలోన మీకును
కాపురంబు వలన కచ్చితముగ !!

తే.గీ: అతివిశాలదృక్పథమది సతిపతులకును
గూర్చు శోభను !జగతికి కూర్మి బంచు
పథమిదియె!!మేము కంటిమి భాగ్యమిద్ది
మీ వలన!!కృష్ణుడిచ్చును మీకు మేలు!!

# గోలి శాస్త్రి గారు

**శ్రీ నారుమంచి అనంత కృష్ణ గారి షష్టి పూర్తి మహోత్సవ సందర్భమున వాణీ కృపతో వారికి సమర్పించు పంచ పద్య రత్నములు.**

కం. శ్రీ నారుమంచి కృష్ణకు
శ్రీనాథుండంబతోడి శ్రీకంఠుడు తా
మీనాడు వచ్చి యీవలె
నేనాటికి తరగని సిరు లిహపర శుభముల్.

ఆ.వె. నారుమంచి వారు న్యాయవాదులు మీద
పద్యవిద్య జనుల బంచదలచి
నారు, మంచి వారు తీరుగా ప్రజ–పద్య
మనుచు కవుల నొకట మసల జేర్చు.

ఆ.వె. నవ్వు మోము తీరు నయముగా మాటాడు
తీరుజూచు వార్కి తీరు మనసు
నందు కలత, పైన నందులే ఖుషిఖుషి
ముచ్చటలను వినగ ముచ్చటగును.

కం. అరువది దాటినవనుచును
సరిగానే జెప్పినార, సరిసరి జూడన్
మరితెల్లజుట్టు యొక్కటె
ఇరువది గాదనుచు జెప్పునితరముకన్నన్.

ఆ.వె. ముందుముందు మీరు మోదమ్ముజెందుచు
సుఖముశాంతులంది శోభమీర
వత్సరములు నిండు వందగాజీవించి
వరలవలయు భువిని హరుని కృపను.

# ఎం.వీ.వీ.యస్.శాస్త్రి గారు

**శ్రీ నారుమంచి అనంత కృష్ణ గారి షష్ఠి పూర్తి మహోత్సవ సందర్భమున వారికి సమర్పించు పంచ పద్య రత్నములు.**

ఆ.వె. మంచిమనసు పద్యమన్న ప్రీతియనంగ
నారుమంచి వారు నవ్వుమోము
తోడ! సభల నడుపు తోటివారిని గూడి
కలసి మెలసి యుండు కవనభూమి.

ఆ.వె. షష్టిపూర్తి నేడు శబ్దవిదునకును
తెలుగు వెలుగు నింప దీక్షతోను
పాటుబడుచునుండె పారమార్థికముగా
శంకరు దయతోడ సౌఖ్యమొసగు.

ఆ.వె. ఫాలమందు మెరయు భానుబింబము వోలె
కుంకురేఖ యెపుడు కొల్వుదీరు
వాదమందు మేటి వాత్సల్యమును జూపు
నారుమంచి వారు నయముగాను.

ఆ.వె. ధవళవస్త్రధారి దారిజూపు మనకు
చిరునగవు మరువని శివునిరూపు
సరసమైన భాష సాహితీ ప్రియుడును
తెలుగుభాష యన్న తెగని మమత.

ఆ.వె. జయము గలుగు గాక జగదీశు కృపతోడ
సంతసంబునొసగు శంకరుండు
నారుమంచి వంశ నాయకందుకొనుము
మాదు వందనములు మాననీయ.

# బీ.య.స్సెస్. ప్రసాద్ గారు

**శ్రీ నారుమంచి అనంత కృష్ణ గారి షష్టి పూర్తి మహోత్సవ సందర్భమున వారికి సమర్పించు పంచరత్నములు**

ఆ.వె. నారుమంచి వంశ నవతేజము తమరు
న్యాయవాద వృత్తినలరినారు
పద్యకవిత నేడు ప్రౌడమ్ము గావింప
నడుము కట్ట తాము ! వడిగ రామె!

ఆ.వె. షష్టి పూర్తి జరుగు సంతోష సమయాన
ధరణి మెచ్చు పనుల దమరు చేయ
శక్తి సంపదలను సమకూర్చి నెరవేర్చ
వేంకటాద్రి విభుని వేడుకొనెద!

ఆ.వె. కవుల మనసు తీరు ధవళ వస్త్రమ్ములన్
చిరునగవుల సిరిని విరివి చేసి
స్నేహ సుధను పంచు శీలధనుడవుకాద
కీర్తిమంతుడౌ యనంతకృష్ణ నీవు!

కం. ఆస్వాద్యము మీ హాస్యము
ఆస్వాదించుము సరసమునంచుల దాకన్
సుస్వరమున కవిత పలుక
విశ్వ సృజుడు తోడు మీకు వేంకట కృష్ణా

కం. వేదార్థములనెరుగ సం
వేదన మీవెంటనుండ విస్సారముగన్
దేదీప్యమానమవ్వదె?
దీధితి మీదీ జగతిని తెలుగు వెలుగులో!

# దువ్వూరి రామమూర్తి గారు

**శ్రీ నారుమంచి అనంత కృష్ణ గారి షష్టి పూర్తి మహోత్సవ సందర్భమున వారికి పద్యనీరాజనము.**

కం. శ్రీకర నార్మంచిజలధి
రాకాశశి! కృష్ణ! సుకవి! రాజిత కీర్తీ!
మీకివియె శుభాకాంక్షలు
గైకొనుడీ షష్టిపూర్తి ఘన పర్వమునన్ . 1

మ. ప్రజ – పద్యంబునకెడ్మినై వరలుచున్ పద్యంబనే యజ్ఞమున్
ప్రజకున్ క్షేమముగోరి దీక్షగొనియున్ ప్రారంభముంజేసి, య
క్కజమౌ రీతిని ఆణి ముత్యములనే గ్రంథంబునే గూర్చి,ది
గ్విజయంబందిన సాహితీ విభుడ వీవే! కృష్ణ! జేజేలివే! 2

మ. భ్రుకుటిన్ కుంకుమ రేఖ దిద్దుకొని యబ్బో! జ్ఞాన సందీప్తితో
నకళంకంబగు సాహితీ గరిమతో ఖ్యాతిన్ సదాపొంది, మ
చ్చికతో ముచ్చటలాడుచున్ వనజతో చెన్నారుశ్రీ కృష్ణ! కం
టికి ఱెప్పట్లుగ మిమ్ముబ్రోచుదురు వాణీ, శ్రీ, యుమా వల్లభుల్. 3

చం. వరగుణులైన మిత్రతతి బంధుసమూహము మెచ్చునట్లుగా
నరువది వర్షముల్ గడచె హాయిగ తీయగ పుత్ర పౌత్రులున్
నిరతము భక్తితోనెపుడు నెమ్మది మిమ్ములగౌరవింప,సుం
దరి వనజా మనోహరుడ! తద్దయు వర్ధిలు నూరు వర్షముల్ 4

తే.గీ. ఔర! మంచి పేరునుగాంచి నారుమంచి –
వారు వర్ధిల్లగావలె వసుధమీద
వనజ–వేంకట కృష్ణులవంశమునకు
తేజమిడునిదె పద్యనీరాజనంబు. 5

## మాకెన సన్నయ్యపాత్రుడు గారు

**శ్రీ వేంకట అనంతకృష్ణగారి షష్ఠిపూర్తి మహోత్సవ పురస్కృతంగా నా నవరత్నమాలిక.**

సీ. కక్షిదారులయందు పక్షపాతములేని
వాదనాపటిమ సంవాది యెవడు
న్యాయసదనమందు న్యాయమూర్తులపట్ల
సమయపాలనజేయు సౌమ్యుడెవడు
న్యాయవాదులతోడ న్యాయసమీక్షలో
సలహాలనందించు సరసుడెవడు
సంప్రదింపులతోడ సామరస్యముగూర్చు
కర్తవ్యదీక్షసంస్కర్త యెవడు

తే.గీ. ఎవడు యెవడంచు సందిగ్ధమేల? నారు -
మంచివేంకటాఖ్యుడు మహిమాన్వితుండు
హైదరాబాదులో న్యాయవాదియతడు
శాంతవచనుండుబేరు యనంతకృష్ణ 1

కం. శ్రీవరసిద్ధివినాయక!
కావగరా! భక్తపాలకా! శతకమ్మున్
సేవకుడనంతకృష్ణుడు
భావాంబుధినోలలాడ భక్తి రచించెన్ 2

సీ. భక్తకల్పద్రుమా! ముక్తికీశాయని -
అష్టోత్తరశతకమందజేసి
శ్రేయస్కరంబెంచి శ్రీధరాయనుబేర -
మకుటంపుశతకాన మహి నుతించి

లలితాసహస్రముల్ లాలించిపాలించి –
లలితపదమ్ముల లలితగొలిచి
భావసౌందర్యమౌ భాస్కరశతకమ్ము –
శ్రీఅనంతునిపై రచించి యవని

తే.గీ. పేరుగాంచినకృతులెన్నొ నారుమంచి
వేంకటాఖ్యుడనంతకృష్ణాంకపీఠ
మధివసించెడి ప్రజపద్యమధుర స్మృతులు
ఆణిముత్యాలసరములై వాణికమరె. 3

ఉ. పద్యము వ్రాయు సత్కవుల భాషకు మూలము సంస్కృతాంధ్రనే –
పథ్యము ముఖ్యమై పద విభాగర సజ్ఞత తోడుగాగ వై
విధ్యకవిత్వమాధురులు విస్తృతమైన పదార్థసంపదల్
హృద్యముగావె పాఠకసుహృజ్జనుడైన యనంతకృష్ణకున్ 4

ఉ. పామరపండితుల్ వినగ పాండితినంతయు ధారవోసి భా –
షామృతవాక్కులన్ జిలికి సారకవిత్వమనంతకోటికిన్
బ్రేమగ పంచి యివ్వగల బేర్మి వహించిన త్యాగశీలివౌ
శ్రీమహితాత్ముడా! విబుధశేముషినొందిన కీర్తిసత్తమా! 5

ఉ. చక్కనిమాటతీరు బహుచక్కని భాషయు మంచియుక్తియున్
అక్కున జేర్చు గౌరవము అంకితభావము నాత్మసిద్ధియున్
మక్కువ వోని యాదరణ మంచి గడించిన మచ్చికంబుతో
నిక్కములయ్యె మీ యెడల నెయ్యముతోడ నను(గ్రహింపుడీ! 6

ఉ. మంచికి మారుబేరు కొలమానము నీతికి కోర్టుకెప్పుడున్
తంచనుదప్పనట్టిపని డాబును దర్పములేనిశైలి మే
లెంచిన బాధ్యతల్ విధులకెన్నడు మానని మాన్యమూర్తి! ఏ
వాంఛలు గోరనట్టి సరివారలలోన యనంతకృష్ణకున్
అంచితభక్తితోడ మనసార్ద్రతకివ్వె నమస్సుమాంజలుల్ 7

తే.గీ. ఆయురారోగ్యమైశ్వర్యదాయకముగ
పుత్రపౌత్రాభివృద్ధితో మైత్రినొంది
భాగ్యనగరాన ముమ్ముందు భావిజీవి -
తమ్మునానందసౌఖ్యాలతనివిగొనుమ! 8

తే.గీ. షష్టిపూర్తి దినోత్సవ సంబరాన
శ్రీయనంతుండు వనజమ్మ సేమమొంద
హరిహరవిరించి సతులతో కరుణజూడ
విన్నవింపులన్ మనసార వేడుకొందు. 9

## కొరిడే విశ్వనాథశర్మ గారు

***ఓం గం గణపతయే నమః ఓం శ్రీ వాగీశ్వర్యై నమః.***
***శ్రీయుత నారుమంచి ఆనంతకృష్ణ గారి షష్టిపూర్తి మహోత్సవమున***
***అభినందన పంచరత్నములు ( సంస్కృత వృత్తములలో )***

1 శ్రీనారుమంచి కుల దుగ్ధాబ్ధిజాత విమలానంతకృష్ణ సుకవే !
ధిక్కారితార్కకర! తేజోలసత్త్రపవర ! పూర్ణేందువద్వరముఖ!
వాణీప్రదత్త వరవాగ్వైభవైర్లసిత విద్వత్సభాముదిత వాక్
ధర్మవ్యతిక్రమణ శీలానుపక్షజన శిక్షానుకూల పదధీః

2 పంచాయతార్చ విధిభక్త్యా సుపూర్తవర పంచాయతస్తుతిశత !
నిత్యార్చనా ముదిత గౌరీపతి ప్రముఖ దత్తప్రసాద విబుధ!
అర్ఘ్యప్రదానకృత జాగృత్ప్రభాకరద తేజోసదుజ్జ్వల తనో
గార్హస్థ్యధర్మ ధృత భాస్వన్నరాకృతి సుతుష్టాతిథిశ్రిత గృహ !

3 త్వత్ప్రేరణా నిభృత ఛందోనుబద్ధ కథనోత్సాహితాః కవివరాః
త్వద్ధీబలాశ్రిత సుధర్మార్థిపక్షబల వాగ్భిర్జితా హి కపటాః
త్వత్ప్రోక్త ధర్మభృత పౌరాణిక ప్రవచనానందితాఖిల జనాః
హే2నంతకృష్ణ ! కవిసమ్రాట్ !సుధర్మచర! హే న్యాయవాదివర భోః !

4 శ్రీనారసింహ పదభక్త్యా హి తే లసతు జిహ్వా సదా బుధ కవే !
నిత్యం సదా భవతు వృద్ధిర్ గృహే తు తవ చైశ్వర్యమీప్సితమథ
ధర్మవ్యతిక్రమణశీలః ప్రయాతు వర(శిక్షా)కారాగృహం తవ ధియా
హే2నంతకృష్ణ ! కవిసమ్రాట్ ! సుధర్మచర! హే న్యాయవాదివర భోః !

5 పద్యాలయా భవతు జిహ్వా మనస్తు తవ దేవార్చనా సునిలయమ్,
పద్మాలయా వసతు తే మందిరే హి వరదైశ్వర్య కల్పలతికా
త్వజ్జీవనం భవతు చానందదం విమలకీర్తిప్రదం శుభకరమ్.
హే2నంతకృష్ణ ! కవిసమ్రాట్ ! సుధర్మచర! షష్ట్యబ్దిపూర్తియువక !

# ఆకుండి శైలజ గారు

## శ్రీయుత నారుమంచి అనంతకృష్ణ గారి
## షష్టిపూర్తి మహోత్సవమున అభినందన పంచరత్నములు

కం. శ్రీ వేంకటేశ దివ్య కృ
పావీక్షణము లనయమ్ము వరములనిడగన్
భావిన్ కాలంబంతయు
భావుకముగ సాగు మాన్య భగవత్ కృపతో!!!

ఆ.వె. న్యాయవాదిగాను న్యాయమున్ నిలబెట్టి
పద్య రచనలోన ప్రభలనంది
కవులకెల్ల స్ఫూర్తి గలిగించు సత్కవీ!
అందుకొనుమ నాదు వందనములు.

సీ. రమణీయమైనట్టి రాజసమ్మును జూపు
వినయమ్ము నలరించు విగ్రహమ్ము
మమకారముప్పొంగ మమతలు పెనవేయు
మాధుర్యమొలికించు మాటతీరు
సిరులకు నెలవైన చిరునవ్వు కురిపించు
ఆత్మీయ వర్షాల నమృతజల్లు
పేరుకు తగినట్లు కారుణ్యమూర్తి యౌ
సాటియెవరు మీకు సద్గుణాఢ్య!

తే.గీ. సాధుయశములనందుచు సర్వులకును
మార్గదర్శకులగుచును మాన్య! మీరు
సకల శుభముల బడయుచు జగతిలోన
తెలుగు వెలుగుల దీపించవలెను దిశల!!!

తే.గీ. సిరులనొసగుచు శ్రీహరి సిరులతల్లి
ఆయురారోగ్యములనిడి హరుడు గౌరి
భావిజీవితంబంతయు వైభవముగ
కరుణజూచుచు సర్వదా గాచుమిమ్ము!!!

తే.గీ. షష్టిపూర్తి మహోత్సవ సంబరముల
సకల బంధుజనమ్ములు సన్నుతింప
ఆదరమ్ములబొందునానందవేళ
చాగిలింతలివియె పుణ్యదంపతులకు.

## కంది శంకరయ్య గారు

***శ్రీ నారుమంచి అనంత కృష్ణ గారి షష్టిపూర్తి మహోత్సవము సందర్భమున ది. 25-12-2017 నాడు సమర్పించిన అభినందన సుమమాల***

కం. శ్రీవాణీగిరిజాపతు
లీ విద్వత్కవివతంసు నెల్లెడలన్ శో
భా విభవ స్వాస్థ్యదులై
దీవింతు రనంతకృష్ణు దేజోమూర్తిన్. . 1

ఆ.వె. నారుమంచి వంశ వారాశి పూర్ణ శ
శాంకమూర్తి వీ వనంతకృష్ణ !
నారు మంచిదగుట నవనవోన్మేష సా
హిత్య సస్యమే రహించు సతము. 2

సీ. గురుతెఱుంగక మున్నె గురుని సహస్రనా
మస్తోత్ర మర్పించి మన్నన గని
శ్రీలలితాపాద చింతనమ్మున మున్గి
లలితపదమ్ములన్ లలిని గొలిచి
శివపుత్రుడగు వరసిద్ధి వినాయకు
భక్తపాలకుని వైభవము బొగడి
భాస్కరు నాదిత్యు భక్తవరదుని మేటి
సీసపద్యమ్ముల జేసి వినతి

తే.గీ. శ్రేయమును గూర్చు శ్రీధరు బ్రీతి గొలిచి
యీశు భక్తకల్పద్రుము నెన్ని మ్రొక్కి
కావ్య చంద్రికలను జల్లు ఘనుడ వీవు
నారుమంచి యనంతకృష్ణా! జయోస్తు! 3

కం. ప్రజ పద్య సమూహమ్మును
విజయపథమ్మునను నడిపి పెక్కు కవులకున్
ఋజుమార్గమ్మును జూపు స
హజ సద్గుణ శోభితా! అనంత యశోధీ! 4

కం. గురుదేవులు, శ్రీలలితయు,
వరసిద్ధివినాయకుండు, భాస్కరుడును, శ్రీ
ధరు, డీశుడు బ్రోతురు స
త్కరుణాసుధలంగురిసి ముదంబలరారన్.. 5

# డా.మాడుగుల అనిల్ కుమార్ గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారి (25/12/2017వ తేదీ) షష్ట్యబ్దిపూర్ణ మహోత్సవ సందర్భముగా సమర్పించిన పంచరత్నములు.***

తే.గీ. షష్టి సంపూర్ణవర్షముల్ జన్మఫలము
చిరునగవు తోడ ననుభవించి, ప్రజలకు
మంచి చేకూర్చి పరవశింపంగనెంచు
నారుమంచి అనంత కృష్ణార్య నుతులు.

కం. నిత్యోత్సాహము మీకై
సత్యమ్ముగ నిచ్చినాడు సజ్జనుడనుచున్
ప్రీత్యర్థము దేవుడు కృత
కృత్యులయిన శ్రీయనంత కృష్ణాచార్యా!

కం. ఇతరులకై తపియించుచు
సతతమ్మున్ జ్ఞానతృష్ణ సాధించుటకై
చతురతతో విలసిల్లెడు
కృతకృత్యా శ్రీయనంత కృష్ణాచార్యా!

కం. మీ పలుకే బంగారము
ప్రాపంచిక విషయములను పరితప్తులకున్
తాపత్రయమున్ దీర్చెడు
కాపరివి యనంతకృష్ణ! కరములు మోడ్తున్

తే.గీ. నారుమంచి అనంత కృష్ణయనినంత
గుండెలో నేదొ మోదమ్ము నిండుకొనును
నిండునూరేళ్ళు వర్ధిల్లనిండటంచు
వేంకటేశ్వరుడు మిము దీవించుగాక!

# చంద్రమౌళి సూర్యనారాయణ గారు

**మాన్యశ్రీ నారుమంచి అనంతకృష్ణ దంపతులకు షష్టిపూర్తి శుభాకాంక్షలతో వినయపూర్వకంగా సమర్పించు పంచ పద్యరత్నాలు**

ఆ.వె. చక్కనైన రూపు చల్లని హృదయమ్ము
స్వంతమైన శ్రీయనంతకృష్ణ
దేవుని దయతోడ దేదీప్యమానమై
షష్టి పూర్తి మీకు జరుగుగాక . 1

ఆ.వె. అరువదేండ్లునిండె ననుమాట మీరన్న
మిమ్మెరిగినవారు నమ్మరసలు
పిల్లవాండ్రతోటి యల్లరి చేసెడు
బాలకృష్ణుడనగవచ్చు మిమ్ము 2

కం. ఒప్పింతురెవరినైనను
తప్పుండిన చెప్పి దిద్ది దండించకనే
మెప్పింతురు నడవడితో
నొప్పింపని మాటమీది నుతియించదగున్ . 3

కం. అన్యాయము నెదిరించెడి
మాన్యమ్మౌ వృత్తిలో సమాజమ్మున సా
మాన్యులకై పోరుట ప్రా
ధాన్యముగా బ్రతుకునట్టి ధన్యుల మీరే 4

కం. కోదండ రాము దయయే
మీ దంపతు లిరువురిపయి మిక్కిలియుండన్
మోదమ్ముగ కలకాల
మ్మాదర్శమ్ముగ బ్రతుకగ నాకాంక్షింతున్ 5

# మాచవోలు శ్రీధరరావు గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారికి తేది 25.12.2017 న షష్టి పూర్తి జరుగుచున్న సందర్భంగా వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు సమకూరాలని కోరుకుంటూ సమర్పించిన అభినందన పంచ పద్య రత్న మాలిక.***

ఉ. శ్రీగణనాథునే స్మరణ చేయుచు వేడెద నారుమంచికిన్
భోగము భాగ్యముల్ కొలిపి, భూరిగ నాయువు, స్వాస్థ్యమివ్వగన్
వేగమె జాతి మెచ్చుకొను విజ్ఞతనందెడి రత్నమై ధరన్
సాగుననంత కృష్ణునకు సంబరమంబరమందగా వలెన్! 1

ఉ. అమ్మ కటాక్ష వీక్షణములందిన భాగవతోత్తమున్ గనన్
కమ్మని భక్తి భావనల కల్మిని చిల్కగ యాననాబ్జమం
దమ్మయె గాన వచ్చెనన నార్ద్రత నింపుననంత కృష్ణకున్
సమ్మతినమ్మ దీవనలె చక్కగ నుండ భజింతు నేనిటన్! 2

మ.కో. చూడగా ప్రజ పద్యమౌనిట శోభిలన్నొక సేనకున్
తోడు నీడ యనంత కృష్ణులె దూరమెంచక మేదినిన్
వాడ వాడల పద్దెమన్నది పాటవమ్మును చాటగన్
'వాడి ' నేర్పిరి నారుమంచియె వ్రాయు వారల వీడకన్ ! . 3

ఆ.వె. ధవళ వస్త్ర ధారి దరహాసములు చిందు
మోము వాడు, కవన కాముకుండు
కుంకుమ తిలకమ్ము కోరి ధరించెడి
యక్షరాల పుట్ట యననితండె! 4

తే.గీ. గణపతియు పటువర్ధన కవుల కూడి
మంచి మనసున్న మా నారుమంచి వారు
నాటినారక్షరమ్ముల దీటుగ ప్రజ
పద్యమును ముఖ పుస్తక బాటలోన! . 5

## పంచాంగం సత్యమ్ గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి వేంకట అనంత కృష్ణ గారి షష్ట్యబ్దిపూర్ణ మహోత్సవ సందర్భముగా (25/12/2017 వ తేదీ) సమర్పించిన పంచరత్నములు.***

ఆ.వె. పుష్య శుద్ధమందు పూజ్యుడు జన్మించె
సప్తమి తిథి నాటి సమయమందు
అమ్మ జపము తప్ప అన్యమెరుగడయ్య
నారుమంచి యనెడు న్యాయ వాది. 1

క అణిమాది గుణోపేతుడు
ఫణిభూషిత శంకరుండు-పద్మజ విధియున్
గణపతి దేవుండిచ్చుత
మణిమయ సంపదలు కీర్తి మహిలో మీకున్ 2

శా. శ్రీంకారాకృతి నిండియున్న భువికిన్ శ్రీదేవియే రాణియై
హ్రీంకారమ్మను పీఠమందు స్థిరయై హ్రీం బీజ మంత్రంబిడన్
ఘీంకారమ్మిడి దివ్యశక్తి పదముల్ క్రీడించె మీనాల్కపై
నింకన్ మిక్కిలి కీర్తినిచ్చి తమకున్ నిశ్శ్రేయసంబిచ్చుతన్. 3

ఆ.వె. చిన్నవారి నడుమ చిన్నారి తానౌను
పెద్దవారినడుమ పెద్దతాను
ముఖము నింద నవ్వు మురిసి యాడుచు నుండు
సరసి పుత్రుడితడు సరసుడితడు. 4

ఆ.వె. సంస్కృతాంధ్ర భాష సాహితీభూషణా!
సకలవేదశాస్త్ర సవ్యసాచి!
సత్యవాక్పటుత్వ సంభాషణా మూర్తి!
నారుమంచి వర్య! నమతులివియె. 5

## గుండా వేంకట సుబ్బ సహదేవుడు గారు

***శ్రీ అనంత కృష్ణగారు మరియు శ్రీమతి వనజ గారల షష్టిపూర్తి సందర్భంగా వారికి శుభాకాంక్షలతో సమర్పించిన పంచరత్నములు.***

కం. ఉదయము లేచినది మొదలు
కదలెడు నుత్సాహమేదొ కనబడునదియే
తుది సాయంత్రము వఱకున్
ముదిమన్నది నారుమంచి మోమున లేదోయ్! 1

కం. నలుబదియేళ్ల యనుభవము
కలబోసిననిరువదేళ్ల ఘటికుండతడోయ్
కొలమానమె తలనెఱపులు?
నలుపే లేకున్న వయసునరువది యెట్లొ? 2

కం. ఉత్సాహము నింపి తనే
ప్రోత్సాహమునందజేయు బూనగ వ్రాయన్
వాత్సల్యమ్మున పద్యము
మత్సరమించుకయు లేని మాన్యులు వారల్! 3

కం. సహనమ్మున దాంపత్యము
నిహమందున నెఱిపినట్టి యీ దంపతులన్
మహదేవుడు దీవించగ
సహస్ర చంద్ర దరిశనము సంప్రాప్తించున్! 4

కం. ముక్కోటి దేవతలతో
నొక్కొక్కరు దీవెనలిడ నుర్వికి పిలువ
న్నెక్కడనో లేమురమే
మక్కడె వారింట నుంటిమనిరే ప్రేమన్ ! 5

## ధనికొండ రవిప్రసాద్ గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి అనంతకృష్ణ శర్మ గారి షష్ఠిపూర్తి సందర్భం గా ప్రేమతో సమర్పించిన నవపద్యరత్నతోరణం***

సీ: మొగముపై చిరునవ్వు మొలకలే యగుపింప -
బొమముడి వేయని విమల గుణము
తనగొప్పదనము మిత్రునకు జెప్పుట మాని
మిత్రుల మెచ్చెడు మేటి గుణము
లక్ష్మిని బంధించి లాభమ్మనక మిత్ర
లాభమే లాభమన్ రమ్యగుణము
అహమొకింతయు లేక నమ్మదే సత్యమౌ
శక్తి యనుచు నమ్ము భక్తిగుణము

గీ: కలిసి యొకరూపమందెను కాదె మన య
నంతకృష్ణుని రూపమై అరువదేండ్లు
కలసి మెలగిన సుగుణ సంకలనమునకు
నాయురారోగ్య సంపదలమరు గాక

ఉ: మాయలు చేయు కృష్ణునకు మా మది పొంగగ వర్ణనమ్ములన్
మాయల బల్క సాధ్యమగు మా ప్రియమిత్రు డనంతకృష్ణుడన్
మాయ యొకింత లేక తన మంచితనమ్మును లిప్తకాలమున్
మాయగనీని కృష్ణునకు మంచిగ వర్ణన జెప్ప సాధ్యమే

మ.కో:న్యాయవాదపు వృత్తి యున్నది నాకు చాలని యెంచకన్
తీయతేనెల తెన్గు కైతకు దివ్యశోభల గూర్చుచున్
న్యాయ మార్గము జూపు చక్కని నాణ్యమౌ ప్రజ – పద్యమన్
స్వీయ సంఘము తోడ యత్నము జేయు నీ కవి ధన్యుడౌ

మ: శతకమ్ముల్ గన పెక్కు నేడు మరి యీశాభక్త కల్పద్రుమా
శతకమ్మే మది నాటుకొన్నయది మా సాహిత్య లోకమ్మునన్
స్తుతియే చాలునె ! తత్త్వపూర్ణ కవితా స్తోత్రమ్ముగా నొప్పె గా
శతవర్షాయు వొసంగు మీ కవికినీశా భక్తకల్పద్రుమా !

కం: అరువదిలో నిరువదియను
తెరగుననారోగ్యమిచ్చి దీర్ఘాయువు న
చ్చెరువొసగు కవితలిచ్చుచు
తిరమగు యశమిడును గాక దేవి సదయయై

ఆ.వె: ధర్మపత్ని యనగ తన మారు పేరను
విధిననంతకృష్ణ విబుధు సతిగ
ననుసరించునట్టి వనజమ్మకున్ సర్వ
వరము లిచ్చు గాక వనజభవుడు.

కం: స్తుతులందు దిట్ట, యప్ర
స్తుతమందును దిట్ట యనగ నవధానములన్
స్తుతి గొను ననంత కృష్ణుని
స్తుతియించెడు పద్యరత్నతోరణ మిదియే

ఆ.వె: నారు మంచి వారు న్యాయవ ృత్తికి వన్నె
తెచ్చినారు మంచి దిట్ట యగుచు,
నారు మంచి దనగ నాబోంట్లకై ప్రజా
పద్యమనెడు నారు పరచినారు.

తే.గీ: వృత్తి యందును మరియు ప్రవృత్తి యందు
జయము నొందగ సిరి, గిరిజయును, వాణి
హరియు, నీశుడున్, ధాతయు వరము లిడగ
వంశమున సర్వ శుభములు వరలు గాక.

## కడియాల శ్రీదేవి గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి అనంతకృష్ణ శర్మ గారి షష్ఠిపూర్తి సందర్భం గా సమర్పించిన పంచరత్నములు***

ఆ.వె. కోటి దీప కాంతి కోవెల జూతుము
మోము జూడ వెల్గు మోదమలరు
అక్షరంబు రమ్యమౌగద దీధితి
కోరి వచ్చు గాదె బ్రహ్మ దీప్తి.

ఆ.వె.సౌమ్యుడతడు చూడ సాహసియున్కాడ
పూలదారమట్లు పూన్కి గల్గి
కలిపి నిలప గలడు మానవులదవిలి
వాడె వీడనంత వాచ్యుడనగ.

ఆ.వె. వృత్తియున్ ప్రవ ృత్తి వెలుగొందుచును తాను
ఘనత బొంగు కుంగు గాననీడు
వర్తిలున్ తదేక వర్తనమ్మునిలచి
పద్యపు మొనదాకె హద్దులెఱిగి.

ఆ.వె. పొగడ నేనును పసిపూతను మాధవ!
పద్య మందు నాకు బలిమి లేదు
వచ్చు యచ్చులన్ని వరుసను బేర్చుచు
జూపు చుంటి నెమ్మి జూడు మోయి.

ఆ.వె. ఎవ్వరెంత వారు, ఎవరైన నిండుగ
అంబ ప్రస్తుతుల్ హృదబ్జమునిడి
పలికెడిదియె పలుకు బంగరు పలుకుగ
నింగి తాకు తాను పొంగిపొరలి.

## మాకెన నారాయణ పాత్రుడు గారు

***బ్రహ్మశ్రీ నారుమంచి అనంతకృష్ణ వనజమ్మ గార్ల షష్ట్యబ్ది మహోత్సవము సందర్భముగా వారికి ప్రేమానురాగములతో సమర్పించుకొనుప్రియ కామన***

ఉ మంచికి మారురూపగుచు మానిత పద్యకవిత్వ సంపదల్
పంచుచు హృద్యపద్యముల భారతికిన్ నతులంద జేయుచున్
సంచిత యాంధ్రభాష సిరి శాశ్వతమై విలసిల్ల జేయు నా
ర్మంచి యనంతకృష్ణుడిల రాజిల వేడెద దేవదేవునిన్

చం నిరవధికమ్ముగా పనులు నేర్పున చేయుచు విశ్రమించకే
కరువులు దీర కమ్మని సుకావ్యములన్ రచియించు మిత్రమా
సురుచిర కీర్తిసంపదల శోభిలి జాబిలి వోలె వెల్గుచున్
అరువది వత్సరంబుల వయస్సున యిర్వది వోలె నుండుమా

కం ఆరుపదులేళ్ళు చాలవు
నూరేళ్ళును బ్రతికి మాకు నూతన కావ్యో
దార సుధల నందింపుడు
దారా సుత బంధుమిత్ర దాసాన్వితులై

మ సరవిన్ రుక్మిణి సత్యభామలనునిచ్చున్ మెచ్చుకృష్ణున్ బలెన్
సరసత్వంబునునింపుసొంపుగదురన్ సంసారివై వెల్గుమా
అరయంగా వనజాసుసాధ్వి భవదీయార్ధాంగియై యొప్పగా
వరసాహిత్య విలాస సుందరి భవద్వైలాస్యయై సోలగా

కం ఆయువునారోగ్యంబును
ధీ యశము సుశోభనములు దృష్టియు పుష్టిన్
ఆ యీశుడు దయసేయుత
జాయా సహితముగ మీకు సౌహార్దముతో

## పాలకుర్తి రామమూర్తి గారు

***శ్రీ విద్యోపాసకులు, ఆత్మీయ మిత్రులు, సాహిత్య భారతీ సమార్చకులు శ్రీ అనంత కృష్ణ గారి షష్టి పూర్తి సందర్భంగా వారి మైత్రికి చిహ్నంగా సస్నేహంగా అభిమానంతో సమర్పిస్తున్న "అక్షర సుమమాల"***

సీ. శ్రీ లలితార్చనా శేముషీ విభవంబు –
ముఖసీమ నర్తించి ముద్దు లొలుక
అభవు ఫాలంబున అలరారు వహ్ని నా –
నుదుట కుంకుమ దీప్తి ముదము గొలుప
ప్రతిభా సముత్పన్న పరిశీలనా దీప్తి
సునిశిత దృష్టియై చూడ్కులమర
పెదవిపై అనిశంబు కదలాడు చిఱునవ్వు
అమృత వాహినియౌచు హాయి గొలుప

తే.గీ. పలుకరింపులో ఆత్మీయ భావమెసగ
అఖిల విశ్వమ్మునందంత వ్యాప్తమైన
ఆదిశక్తిని హృదయమ్మునందు నిలిపి
అర్చ సేయుననంత కృష్ణాఖ్య బుధుడు.

ఆ.వె. నారుమంచి వంశ గౌరవమ్మును బెంచు
జ్ఞానరతియు, విహిత కర్మరతియు
సమత జూపు, భావ సౌమనస్యత జూపు
చిత్త వృత్తి న్యాయ వృత్తి గొనియె.

ఉ. చేసిన సాధనా ఫలము స్నిగ్ధ మనోహర భావదీప్తమై
బాసగ మారి ఈశ్వరుని పాదయుగంబు సమాశ్రయింపగా
భాసుర కావ్యధారలయి పాఠక చిత్తములందు పొంగెనో
భూసురవర్య! అభ్యుదయముల్, విభవంబు, యశంబు మీకగున్

చ. అరువది వత్సరాల విభవాభ్యుదయంబులు శోభ గూర్చె మీ
పరువము ధన్య మయ్యె ఫలవంతములయ్యె ప్రయత్న శీలతల్
ఇరువయి నిల్చినారు తమయింటను లక్ష్మియు భారతమ్మ, సం
భరిత శివార్చనారతులు, ప్రాజ్ఞులు మీకు శుభంబు మిత్రమా !

సీ. ఆద్యమనంతమ్ము అవ్యయంబౌ నాది
శక్తియ మీకు ప్రశాంతి నిడుత
హరునర్ధ దేహమై అలరారు భవురాణి
సత్క్రియాచరణ సంస్కారమిడుత
వనజనాభుని రాణి వసియించి హృదయాన
పరిణతయోజనా పటిమ నిడుత
వనజాసనుని రాణి వర్తిల్లి జిహ్వపై -
ప్రేమానురాగ వాగ్రీతులిడుత

తే.గీ. వనజయు ననంత కృష్ణ దంపతుల, హితుల
షష్టిపూర్తి మహోత్సవ సమయమందు
వారి కాయురారోగ్యమ్ము ప్రగతి సుగతు
లిచ్చి శుభదృష్టి నేలుతనిభ ముఖుండు!

# గండూరి లక్ష్మీనారాయణ గారు

**శ్రీ నారుమంచి అనంత కృష్ణ గారికి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున**
**అక్షర కానుక పంచ పద్య మౌక్తిక మాల**

ఉత్సాహ
మేరునగమువోలె నిల్చు మేటి పద్య సేవకై
యారు పదులు నిండినట్టి యార్య మీకు సన్నుతుల్
చేర దీసి కవులనెల్ల చేసి కావ్యనిర్మితిన్
ధీర ధనిక పెంచినావు తెలుగు తేజమంతటన్

మ. పలు ప్రాంతంబులలో వసించు కవులన్ భాషాభిమానాఢ్యులన్
తెలుగమ్మన్ మురిపింపజేయనిలలో ధీయుక్తితో గల్పియున్
విలువన్ బెంచితివీవు, నవ్య కవులున్ వేనోళ్ళ కీర్తించగా
కవి రాజోత్తమ ! కల్గె సంతసము నీ కార్యోన్నతిన్ గాంచగన్

కం. కమ్మని పద్య కవిత్వము
నిమ్మహి వికసింపజేయ నీ ప్రజ-పద్యం
బమ్మో! కృతి రూపంబై
సమ్మానముబొందె, మాకు సమ్ముదమాయెన్

ఉ. మీరు కవీశ్వరోత్తములు, మీరు మహోన్నత న్యాయమూర్తులున్,
మీరలె పద్య పండితులు, మీరు నిగర్వియు మానవోత్తముల్
మీరలె తెల్గు తేజమును మేదిని రాజిలజేసినారు మీ
చేరువ జేరుకొన్నకవి శేఖరులెల్లరు ధన్యజీవులే

కం. దూరపు భారముచే మిము
జేరగ రానైతినార్య చెలువము మీరన్
గారవమున పద్యమ్ముల
సారస సుమమాలనంపి సన్నుతి జేతున్

# వెంకటప్పయ్య టేకుమళ్ళ గారు

**_శ్రీ నారుమంచి అనంత కృష్ణ గారికి షష్టిపూర్త్యోత్సవ సందర్భమున సమర్పించిన పద్య పంచరత్నాలు_**

సీ. శ్రీరస్తు! శుభమస్తు! శ్రీరామ రక్షయని
దేవతా గణములు దీవెనీయ
వేడెదనెల్లర వేవేల రీతుల
వాలిన భక్తితో వైభవముగ
అనంతకృష్ణుండు యందరి బంధువై
అలరారుచున్నట్టి ఆత్మసముడు
అవధానమందున హాస్యపు జల్లుల
జనముపై జల్లెడి చతురుడితడు.

ఆ.వె. నారుమంచి వారి నాలుక పైనను
పద్యసౌరభమ్ము పరిమళించు
పద్య విద్య యందు పట్టును గలిగిన
మంచి మనసు యున్న మనుజుడతడు.

ఉ. పద్యపు సౌరభమ్ములను పంచగ నిల్చిన వందనీయుడా!
పద్యము జచ్చెనింకయని బల్కెడి వారల లెక్క జేయకన్
పద్యము గొప్పదే యనుచు పంతము వీడక నిల్చిజూపగన్
ఉద్యమ రీతిలో నిలిచెనుత్తమ సంస్కృతి పల్లవించగన్!

3. ఉ. కాసులు గోరకన్ తమరు కమ్మని కావ్యములచ్చువేయగన్
వాసికి, రాశికిన్ మిగుల వార్నిధి యాయెను గ్రంథరాజముల్
మాసిన పద్య సౌరభము మళ్ళగ బాటలు సంఘసేవకై
కూసిన కోతులే యిపుడు గొప్పని పద్యము గారవించెగా!

ఆ.వె. మొదట బ్యాంకు పనిని ముదముగ జేయంగ
యిపుడు న్యాయ వృత్తి యిష్టమాయె!
చిత్తశుద్ధి తోడ చేసిన పనులెల్ల
జాతి ప్రగతి హెచ్చు జనులు మెచ్చు.

తే.గీ. పద్య విద్యలో శోభించి పరిమళించ
వాణి జిహ్వాను నిలిచేను వదలకుండ
ఆయురారోగ్య సంపదల్ అమరునటుల
కనకదుర్గమ కరుణించి గాచు మిమ్ము!

## ధూళిపాళ అర్కసోమయాజి గారు

***శ్రీనారుమంచి వేంకట అనంత కృష్ణ గారికి షష్ట్యబ్దపూర్త్యుత్సవ శుభవేళ సగౌరవంగా సమర్పిస్తున్న అభినందనాక్షర ప్రసూనాంజలి!***

మ. అతడా?యాతడనంతుడే సకల విద్యా పారసంపత్తిల
మతిలో సాటి కదా బృహస్పతికి సంభావింప నేడిద్ధర
న్నత డార్వాంబుధినాచమించిన యగస్త్యర్షీంద్రుడే వాని వి
స్తృతికిన్ లేదిల మానదండమిక యోచింపంగ గృష్ణాఢ్యుడే 1

ఉ. అందరికాప్తుడాతడు బుధాళి పదాంబుజ నిత్య సేవనా
నంద శుభైకపాత్రుడు ఘనప్రతిపద్యరహస్యచింతనా
స్పందన పూత గాత్రుడు వశంవద చిత్త విశోధన క్రియా -
మందచరిత్రుడెల్లరి నమస్తుతి పాత్రుడనంత కృష్ణుడున్ 2

ఉ. పట్టెడు బొట్టదే నుదుటి భాగమునందుననంతు శక్తి తా
గుట్టుగ గూడుకట్టి పలుకున్ దను బిల్చిన పట్టులందు నె
ప్పట్టున సత్క్రియాచరణ బట్టెడు మార్గముబుట్ట దిట్టచే
పట్టిన పట్టు నెట్టులును బాయక గట్టిగ దట్టి నెట్టుచున్ 3

మ. ప్రభవాద్యబ్దములర్వదిన్ ఘనవచః ప్రాగల్భ్య కేళీ కళా
విభవంబొప్పగ జుట్ట బెట్టుచును నిర్విఘ్నమ్ముగానెన్నియో
శుభ సంకల్పములన్వెలార్చెను మనశ్శుద్ధిన్ననంతుండు మో
ద భరాపూర మనః ప్రఫుల్ల వనజాంతఃపీఠ సంవాసియై! 4.

సీ. ఏ మహాత్ము తపస్సునిసుమంత దలపంగ
చింతలు వంతలు జెదరిపోవు
ఏఘను నుతియింప నీరేడు లోకాల –
దివిజుల బొగడిన తీరు వొడము
ఏ భవ్యుని గనంగ నేరిని మరిజూడ –
వలెనను బుద్ధియే వరలకుండు
ఏ పరాత్పరు మ్రోల నిహపర సుఖములు –
మోక్ష సామ్రాజ్యమై ముదము గాంచు

తే.గీ. అమ్మ పేరెత్తి పిలువ సోఽహమ్మటంచు
నావహించుచు మదిని బ్రత్యక్ష మగును
యట్టి దైవాంశను వరించి యలరి మించు
నారుమంచి యనంత కృష్ణవరునెంచ
కొంచమైనను గావలె సంచితమ్ము. 5

చం. పది పురుషాంతరంబులు స్వబంధు జనంబులు వెన్క ముందు న
భ్యుదయ పరంపరావహ మహోజ్వల కీర్తి దరించు పద్య సం
పద పొలుపారె మాకు ప్రజ–పద్య గణమ్మునననంత కృష్ణుదౌ
సదమల స్నేహ సౌరభమజస్రము వాడని పూలగుత్తియే 6

# అమరవాది రాజశేఖరశర్మ గారు

***శ్రీనారుమంచి వేంకట అనంత కృష్ణ గారికి షష్ట్యబ్దపూర్త్యుత్సవ శుభవేళ సగౌరవంగా సమర్పిస్తున్న పంచరత్నములు.***

సీ. చెరగని నవ్వులన్ స్థిరముగా మోముపై
సతతము నిలిపిన సాధువెవరు?
భేదమెన్నడు లేక మోదమునందరిన్
తొలుత పలుకరించు తోడుయెవరు?
ఆత్మీయ భావమునలరగా శోభిల్లు
హావభావాలిడు యాప్తుడెవరు?
పదవిలో తెలివిలో ప్రఖ్యాతుడైనను
వినయ సంపత్తితో వెలుగు నెవరు?

తే.గీ. తెలుగు దనమును కాపాడ తెగువజూపి
పద్యమును రక్షణము సేయ ప్రతినదాల్చి
కవుల కలములు సాగగా కథనమిడగ
తృష్ణయే గలుగుననంత కృష్ణుడొకడె. 1

తే.గీ. పద్యములు రాయుటందున పట్టుగలిగి
మిగుల ప్రోత్సాహమందించి మెలుగ గలిగి
స్నేహమాధుర్యమున్ బంచు చేవ గలిగి
వెలుగనంత కృష్ణయ్యయే వెరుపులేక. 2

కం. కలకాలంబారోగ్యము
కలకాలము సంతసము సకల సంపదలున్
కలకాలము నిలు యశమే
కలగాలని కోరుకొందు ఘనముగ కృష్ణా! 3

తే.గీ. పేరుకరువది వర్షముల్ చేరుకొనిన
నిత్య నూతనోత్సాహంబు నిర్భయమును
కార్య సాధనలో ధైర్య స్థైర్యములను
కోసలేశుండు మీకిడ కోరుకుందు. 4

తే.గీ. కావ్యమును రాసి వెలయించు కవికి జయము
న్యాయవాదికి సతతమునలరు జయము
స్నేహశీలికి గలుగును నియత జయము
షష్టిపూర్తిననంతుడా జయము శుభము. 5

## డా.వృద్ధుల శాస్త్రి గారు

***శ్రీనారుమంచి అనంతకృష్ణ గారి షష్టిపూర్తి సందర్భంగా***
***శుభాభినందనపద్యమాల***

కం. శ్రీగౌరీ చరణమ్ముల
సౌగంధపు పుష్పసేవ శ్రద్ధార్పితమై
భూగోళము విడనాడగ
సాగింపుము ముక్తియాత్ర సత్కృపమీరన్

సీ. జనని సరోజమ్మ, జనకుండు
శ్రీశర్మ ఘనగోత్ర మూలంబు కౌశికంబు
భాగ్యనగరవాసి, వనజమ్మ నీభార్య
చారుకౌటుంబంబు నారుమంచి
తనువులో మనములో తెనుగుసాహిత్యంబు
నిలువెల్ల తిరుగాడు నెత్తురీది
పలుకులో కులుకులో పద్యప్రవాహంబు
ఉయ్యాలలూగేటి ఊపిరీది

తే.గీ. శివుని గాయత్రిపూజలన్ చేయునట్టి
పంచకట్టు బొట్టులను ప్రేమించునట్టి
అద్భుతచరితుడవునీవు అమ్మదయయె
నాల్కపైగలతృష్ణ! అనంతకృష్ణ!

కం. ధననిధి ఉద్యోగంబును
వెనుకటి సమయానజేసి విరమింపంగన్
ఘనమైన న్యాయవృత్తిని
మనసారగ గఱపుచున్న మాన్యుడవయ్యా!

తే.గీ. సౌమ్యసౌహార్ద్రహాసముల్ శాంతగుణము
ప్రకృతి దత్తంబు భవదీయ భాగ్యగరిమ
సాధువర్తన మృదువాక్కు సాంత్వనములు
కణకణమ్మున భాసిల్లు ఘనతనీది.

ఉ. పావన దీక్షబూని ప్రజపద్య సుగంధ ఝరీ సమీరముల్
బ్రోవగ, శక్తియుక్తులను పుష్టిగ వెట్టి తరించునట్టి నీ
సేవకు వందవందనలు సేయగ పాత్రత యున్న నీకిలన్
దైవమునిచ్చు! దీవెనలు ధన్యుడవయ్య! అనంతకృష్ణవో!

తే.గీ. గరపినావట! అయ్యహెూ! అరువదేండ్లు
అట్టులుండవు జవసత్వముట్టిపడును
అస్తు శ్రీరస్తు శుభమస్తు ఆయురస్తు
చిత్తమందిష్ట కామ్యార్థ సిద్ధిరస్తు.

# కొనకళ్ళ ఫణీంద్రరావు గారు

**శ్రీనారుమంచి అనంతకృష్ణ గారి షష్టిపూర్తి సందర్భంగా:**

**శుభాభినందనపద్యమాల**

తే.గీ పచ్చని ప్రజ పద్యము పాలకుండు
గణపతి పటవర్ధనులను కలుపు గొనుచు
పద్య రచనల పటిమకు పదును బెడుతు
నారు మంచి యనంతుడై పేరుగాంచె.

ఉ. శ్రీకరుడైన యీ సుగుణశీలుడు కృష్ణుని నామధేయుడై
శ్రీకరమౌ సుశిక్షణకు శేఖరుడౌతు వెలుంగు పద్యమై
శ్రాకులు మెచ్చగా నిచట శ్రద్ధగ జూచును యన్నికార్యముల్
శ్రీకిని శారదాంబకును చిత్తము నందున ముద్దుబిడ్డడై

తే.గీ నుదుట కుంకుమ బొట్టుతొ ఎదుట పదును
ముఖము చిరునవ్వు చూడను ముచ్చటౌను
మదము మాత్సర్యములు లేని మంచి మనిషి
మనసున మనసై మెలిగెడి మాన్యుడతడు.

తే.గీ జన్మదిన వేడుకలనిన సంబరమ్మొ
ఘనుడనంతునకు జరిగె ఘనముగాను
షష్టిపూర్తి మిగిల్చిన జ్ఞాపకముల
ధర్మపత్ని జీవితమును ధన్యమయ్యె.

ఉ. పద్యమె జీవితమ్మని శుభమ్ముగ పల్కెడి స్నేహశీలి యే
పద్యసదస్సులందయిన వచ్చును ముందుగ నవ్వుమోముతో
సేద్యము జేయు కర్షకుడె చిక్కని సాహితి క్షేత్రమంతటన్
సాధ్యము జేయునందరికి చక్కని పద్యము పట్టుపట్టగా

సీ. ప్రజ – పద్యంబున పరిమళించినపూవు –
ఆనంద కృష్ణుడై అలరునిచట
పద్యసమూహాన పండిన వెన్నెలే –
పదుగురు మెచ్చెడి వన్నె కాదు
మిత్రుల హృదయాల మీటు సంగీతమే –
మనసుదోచుకొనెడి మంచిమనిషి
సాహితీ భువనాన జ్వలితమౌ తారయే –
పండితులందున పండితుండు

తే.గీ. అమ్మనెంతనో నమ్మెడునాత్మయందు
ఆమె తనకైన రక్షణ యనునతండు
అమ్మ యండగ యుండును అన్ని చోట్ల
అందరాశీస్సులుండుగానతనికెపుడు.

## మాడుగుల నారాయణమూర్తి గారు

***శ్రీ నారుమంచి అనంత కృష్ణ గారికి***

***షష్టిపూర్తి సందర్భముగా సమర్పించిన పద్యరత్నచతుష్టయమ్.***

ఆ.వె. నారుమంచి వంశ పేరు ప్రఖ్యాతుల
నంతకృష్ణ గారి స్వంతమయ్యె
చింత లోన మంచిచే తన, జీవన
శైలి పద్యరక్ష శక్తిపరుడు. 1

చం. నుతులగనంతకృష్ణునకు నూతన భావ విహారి ధాతకున్
కృతులను లేఖినీ తతుల కీర్తిని శ్రీ ముఖపుస్తకమ్మునన్
క్రతువుగ కైతదీక్షగొని రాతలనిచ్చిన జాతి రత్నమున్
సతతము మెచ్చుకొందుగద సాహితి ధారల స్నేహ మాధురిన్ 2

తే.గీ. సంగడి ప్రజాపద్యము సంగమందు
పక్షమంతయు వెన్నెల పంచె మనకు
తక్షణమ్మును స్పందించె తనకుతానె
దక్షుడై సభ పెద్దయౌ ధర్మవర్తి. 3

కం. శుభములు జన్మదినమ్మున
ప్రభలను వెలిగించె రవిగ పద్యములరయన్
ఇభముఖు దీవన సేవలు
నభమును భూభాగమంత నవ్వులు పంచన్. 4

## హట్టి భానుమతి గారు

**శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు**

**శ్రీనారుమంచివెంకట అనంతకృష్ణ శ్రీమతివనజ దంపతులకు**

**శుభాకాంక్షలతో పంచరత్నములు**

కం. శ్రీగణనాథుడు వెడలెను
వాగీశుని పత్ని వాణి , వరలక్ష్మలతోన్
వేగమె యాశీస్సులొసగ
సాగిరి షష్ట్యబ్దిపూర్తి సంబరములకై 1

ఆ.వె. నారుమంచివారు నగుమోము గలవారు
న్యాయవాదవృత్తి నడుపువారు
పద్యప్రేమికుండు, ప్రజ-పద్య యధినేత
శ్రీయనంతకృష్ణ శుభము జయము. 2

ఆ.వె. శారదాంబ పలుక శతకరత్నములతో
పద్యవిద్యతోడ ప్రణతులొసగె
పద్యపూజ జరిపు పంచాయతనమైన
శ్రీయనంతకృష్ణ శుభము జయము. 3

ఆ.వె. అలుపునెరుగనట్టి యరువదేండ్ల వయసు
పద్యమనిననెగిరి పరుగులెట్టు
సమయపాలనమున సరిరారు యెవ్వరూ
శ్రీయనంతకృష్ణ శుభము జయము. 4

తే.గీ. ఆయురారోగ్యమైశ్వర్యమష్టసిరులు,
పుత్ర,పౌత్రుల మమతతో పూర్ణుడగుచు
నిండునూరేళ్లు ప్రేమతో నిలుచుగాత!
మంగళంబులు మీకు సన్మంగళములు. 5

## వసంత మల్లప్ప గారు

***ధర్మపత్ని శ్రీమతి వనజా సమేతులగు బ్రహ్మ శ్రీ నారుమంచి అనంతకృష్ణ మహోదయులకు వారి షష్ట్యబ్దపూర్ణ మహోత్సవ శుభ సందర్భ అభినందన మందారమాల.***

శా. శ్రీవిభ్రాజితు నే నుతింతు సుమన శ్రీరాజితున్నేడు సం
భావింతున్ ఘనకీర్తి చంద్రికలతో భాసించు సచ్ఛీలునిన్
ధీవైశిష్ట్యు దనంతకృష్ణ విబుధున్ శ్రీమాతయౌశాంకరీ
దేవిన్గొల్చెడు పుణ్యశీలిగను సందీపించు శుద్ధాత్మునిన్ 1

ఉ. అమ్మను నమ్మికొన్న మన యాప్తుడు మాన్యుడనంత కృష్ణకున్
సొమ్ములవెన్ని యిచ్చినను, స్తోత్రములెన్నియొనర్చి సత్కృతుల్
ఎమ్మెయి జేసినన్ తనివి యెట్టుల దీరునటంచునెంచి నా
నెమ్మనమందునన్ బొడము నిర్మలభావమరంద పూర్ణమౌ
కమ్మని పద్యపుష్పముల కానుకలిచ్చి నమస్కరించి నే
నమ్మహితాత్మకున్ శుభములన్ని యొసంగదయాసముద్రయౌ
అమ్మను వేడుకొందిహపరాభ్యుదయమ్ములనీయ, ముప్వురౌ
అమ్మల మూలరూపిణి నజాండ శరీరిణి నా పరాత్పరిన్ 2

మ.కో.నారుమంచి యనంతకృష్ణుడు న్యాయవాదియునై యిలన్
శారదా చరణాంబుజాత రజమ్ము దాల్చిశిరమ్మునన్
సార పూర్ణ మనోజ్ఞభావ సుసాహితీ సుమసౌరభాల్
నేరుగా తను స్వీకరించుచు నిగ్గులొల్కెడు పద్య మం
దార మాధురులందజేయుచు ధన్యతన్గనె, నాతనిం
జేరి షష్టివసంత పూర్ణుని శ్రీకరోత్సవ మెల్ల సం
బారముల్ సమకూర్చి మిక్కిలి వైభవమ్మునజేయు సం
స్కారులౌ ద్విజవర్యులున్ విధిగా యొనర్చుసుపద్ధతిన్
సార సాక్షి,సుశీలయౌ వనజా సతీమణి ప్రక్కనిం
పారనుండగ జూడగల్గెడు భాగ్యమబ్బిన దిత్తరిన్ 3

మ. ప్రజకై పద్యమటన్న దృక్పథముతో పద్యాభిమానమ్ముతో
ప్రజ–పద్యమ్మను సత్సమూహమున తాన్ ప్రాజ్ఞుండుగానొప్పుచున్
ప్రజకున్ సేమము గూర్చగా గణపతిన్, పట్వర్ధనుంగూడియున్
ప్రజ–పద్యమ్మున నెడ్మినై బరగుచున్ పద్యాలకున్ పట్టమున్
సుజనానీకము మెచ్చ గట్టి ఘనమౌ సుశ్రూషజేయుందగన్ 4

సీ. ఆణి ముత్యమ్ముల యాణి ముత్యములను –
ఆణి ముత్యాలుగానచ్చు వేసి
అందమౌ పుస్తకమందించనశ్రాంత –
కృషి సల్పె తానొక ఋషిగ మారి
అరువది నిండినన్ ఇరువదిలో నుండు –
చురుకుదనమ్మునే చూపు వాడు
సేవానిరతుడైన స్నేహశీలుడగుచు –
పరులకుపకరించు పరహితుండు

ఆ.వె అతని నభినుతించి యభినందనలు శుభా
కాంక్ష లిటుల పద్య కవిత లల్లి
తెలుపుచుంటి, జాను తెలుగులోనతడొక
ఆణి ముత్యమనుట యగును సబబు. 5

## మాకెన ఆచార్య సీతారామ పాత్రుడు గారు

***శ్రీ నారుమంచి అనంత కృష్ణారావుగారికి శష్టిపూర్త్యోత్సవ సందర్భమున సమర్పించిన నవరత్నపద్యసుమాంజలి.***

చం. అరువదియేండ్లు పూర్తయెను, ఆర్యుడనంతునిషష్టిపూర్తికిన్
గురువులు శిష్యులున్ హితులు, కోరని బంధువులెందరెందరో
తరతమభేధముల్ మరచి, దర్శనభాగ్యముసేయగోరగా
కరమనురక్తితోనటకు గాంచగవచ్చిరి ధన్యజీవులై
జరిగెనుదైవసాయమున షష్టిదినోత్సవమెల్లరుండగన్ 1

ఉ. మంచికి నారుమంచి పరమార్ధపుసంచికి బేరుమంచి నో
ర్మంచిని సాహితీసుధలబంచి కవిత్వములందుదృష్టి సా
రించి, మథించి, మాకువివరించిన, వేంకటనంతకృష్ణ మా
మంచిగనాణిముత్యములు మంచిగపంచుటదెంత మంచియో 2

సీ. కార్మికసంక్షేమ కార్యక్రమాలపై -
సర్కారుబడిగుళ్ళ చదువుపైన
తొలకరి చినుకుల తలపుల రైతుల -
వృధ్ధాప్యజీవన వ్యథలపైన
జనరక్షనార్థమై జలరక్షచర్యపై -
ప్రజలబాగోగుల విజనుపైన
విచ్ఛిన్నమవుతున్న వేధనాభరితమౌ -
వైవాహ కర్తవ్య యావపైన

మాదకద్రవ్యాల మత్తులోతుల తూగు –
యువత ప్రభావంపు భవితపైన
సమసమాజమునందు సంఘాల శ్రేయస్సు –
మనపాత్రలోనున్న మనసుపైన
భాషపై మనతెల్గు పరిరక్షణమ్ముకై –
భాధ్యతలున్నట్టి ప్రభుతపైన
వైవిద్యభరితమౌ వైద్యరంగమునందు –
మార్పులో గల సమీకరణపైన

తే.గీ. దృశ్యదర్శినపట్లవశ్యమైన సమాజ
ప్రాభవకదనాల వరసపైన
భారతరాజ్యాంగ భావప్రకటనలో
స్వేచ్ఛపై మనకున్న ఇచ్ఛపైన !
అర్థవంతంపు సంవత్సరార్ధమంత –
నాంధ్రతెలగాణ ప్రజ పద్యమధ్వరమ్ము
నిర్వహించి రసజ్ఞుడై సర్వకవుల –
కాణిముత్యాలని యనంతకృష్ణుడిచ్చె. 3

కం. ద్వాదశపక్షసమస్యలు
సాదరపూర్వంబుజెప్ప సర్వసమర్థుల్
హైదరబాదునగల మీ
సోదరపూర్వంబుమాకు స్ఫూర్తివహించెన్ 4

ఆ.వె. నారుబోయువాడు నీరుబోసెడుసూక్తి
నోరుమంచివారు నారుమంచి
ఘనయనంతకృష్ణ కవనయశస్వియై
సృష్టికర్త షష్టిపుష్టిగూర్చె. 5

కం. తనయులతో తనయలతో
మనుమలతో మనుమరాళ్ళ మనసులతోడన్
వనజాకృష్ణులు నిరతము
తనివినిబొందంగవలయు తన్మయమతులై 6

కం. వాణీగిరిజారమయున్
ప్రాణేశులతోడభవదు ప్రాభవమొప్పన్
రాణింపగోరుకొందును
ప్రాణాధిపసాక్షిగాను ప్రార్థింతుమదిన్ 7

కం. ఆయువునారోగ్యంబును
శ్రేయస్సునుగలిగిమీరు శ్రీలొందంగన్
ఈ యుర్విన్ చిరకాలము
ధీయుతమగుశక్తితోడ దీవనలివ్వన్ 8

ఉ. శ్రీయుతనారుమంచికవిశేఖర వేంకటనంతకృష్ణ వి
ద్యాయుతకీర్తిశాలి గణతంత్రుడు ధార్మికతత్త్వవేత్త ఆ
త్మీయుడు సంస్కృతాంధ్రముల దీప్తినెఱుంగు హితైకభాషి ని -
ర్ణాయకమార్గదర్శి యనురాగము ప్రేమయునావహించు నా
రాయణదివ్యరూప!, నవరత్నసుమాంజలి! స్వీకరించుమా 9

## పొన్నెకంటి సూర్యనారాయణ రావు గారు

***శ్రీ నార్మంచిఅనంతకృష్ణ శర్మ గారి షష్టి పూర్త్యుత్సవము***
***సందర్భముగా శుభాకాంక్షలు.***

చం. అరువది వర్షముల్ రచనలబ్బుర పర్చుగజేయుచుండి మీ
సురుచిరపాండితీ ప్రతిభ సుందరభావసుగంధవాయువుల్
పరిపరి వీచినారుగద పండితవర్య! యనంతకృష్ణ! మీ
నిరుపమ సాహితీకృషి త్రిణేత్రుడు మెచ్చు నిరంతరంబుగన్ 1

ఉ. మోమునచిన్ననవ్వు పరిపూర్ణతగూర్చగ కుంకుమంబదే
నీమము దప్పరాదనెడు నిత్యవిశిష్టపు సంప్రదాయమౌ
మీ మనమా సుమాన్వితమమేయ సుచందననందనంబగున్
ఓమమతానురాగసుగుణోన్నతశేఖర! పండితాగ్రణీ! . 2

కం. శ్రీరాము కరుణ వలనను
పోరాములు సుంతలేక పొంగును సుఖముల్
గౌరీశు సత్కృపాళిని
మీరిర్వురు వర్ధిలంగ మేలగునిచ్చుల్ 3

తే.గీ. సంస్కృతాంధ్రములింపుగ సమముజేసి
పంచినారటు సార విపంచి మీటి
మేటిపండితకవులయ్య మీరలెపుడు
వాణి కరుణించు సతము నవ్వారిగాగ. 4

తే.గీ. భావి కాలంబు మీకెప్డు పదిలమైన
బహుళ శ్రేయంబు గల్గంగ భద్రమగుత!
బంధుమిత్రుల మీయిల్లు భవ్య మగుత!
పండితాగ్రణి! భావాల పంటయగుత! 5.

## సుసర్ల నాగజ్యోతిరమణ గారు

చం. అరువది యేండ్ల సంబరమనంతులవారికి వచ్చెనయ్యహో
చొరవగ మిత్రులందరును సూనృతవాక్కులు బల్క రారహో
నిరతము శాంతి సౌఖ్యములు నెమ్మిని గూర్చుచు వీరి ముంగిటన్
బరగెడు పూర్ణకామములు ప్రాప్తిలజేయుత వేంకటేశుడున్

## వీ.వీ.యన్.వరలక్ష్మి గారు

ఆ.వె. కొత్త వారికైన గొప్ప మిత్రులు వీరు
పద్యమన్న పాటు పడును చాల
మర్మముండదెపుడు మంచితనమె గాని
జన్మ దినము నాడు జయము జయము.

## మంతెన ఝాన్సీ గారు

సీ. **నా**తి వనజ తానె ప్రీతి బెండ్లాడన
**రు**వదిన మురిసె నిరువదిగాను
**మం**చి మాటల జెప్పు మామంచి యన్నయ్య
**చి**రునవ్వు నెప్పుడు చెదరనీడు
**వేం**కట నాథుని విడువక గొలుచును
**క**ల్లలే ఎరుగని పిల్లవాడ
**ట** గనుడు తీపి మాటలకు లోటు
**అ**సలు లేదు వినుడో అయ్యలార!

ఆ.వె. **నం**ద నందను వలె న్యాయము జెప్పును
**త**ప్పులొప్పులెన్ను తగిన వృత్తి
**కృ**ష్ణరాయల వలె కృతిపతి పద్యతృ
**ష్ణన్** రచనలు జేసె సవ్యసాచి.

*(పద్య విశేషము,, ప్రతి పాదములోని మొదటి అక్షరములను కలిపి చదవ గలరు. సోదరులు నారుమంచి వేంకట అనంత కృష్ణ గారికి హృదయపూర్వక జన్మదిన మరియు షష్టిపూర్తి మహోత్సవ శుభాభినందనలు.)*

## డీ.వీ.ఆర్. గారు

**శ్రీ నారుమంచి అనంత కృష్ణ గారి షష్టి పూర్తి మహోత్సవ సందర్భమున వారికి కవితాహారతి.**

నారుమంచివారు
మహోమంచివారు
చిరునవ్వులుచిందిస్తూ
చింతలుబాపేవారు
అనంత ఆనందములను పంచువారు
ఆత్మీయతాభిమానములిచ్చువారు
వారికివే నా అక్షరాభినంధనలు
వారిషష్టిపూర్తి మహోత్సావానికి
నాశతసహస్రవందనములు.

## సంధ్యగోళ్ళమూడి గారు

**శ్రీ నారుమంచి వెంకట అనంతకృష్ణ, షష్ఠిపూర్తి సందర్భముగా వ్రాసినపద్యములు . నాకు మంచబ్బాయిని పొగడాలి అంటే మాటలే కరువు అయ్యాయి .పదే పదే కొన్ని పదాలు వదలక వెంటాడాయి**

సీ. అజరము అనవరతమతని అనిలము
కనగను యరుదట గనగయెఱుగ
డు విసుగు యెఱుగునిటు సమతమమతల
పరుగున జేయును పనుల నతడు
మనకు అగజ జూచుననుచు అదరక న
డువ తా అడగడు అరవ డనుజుడు
మనకును సహజుడు మరువకు మది నను
మనుజుల జూచు తా మమత గూర్చు.

తే.గీ. శుభము తమకుయ లలిత యొసుగు కపిలుడు
మెలపుజుడగును తరలను మెఱపుగబొవ
జుచితి మరదలి కలిమిని, జుచితి వెలుగు
సుతుని గనగను గనులను సుతుని జుచితి

తే.గీ. సరసపు బలుకు గలగల సరసు డతడు
సరళ చేతల మనుజుడు సెలవుయతను
మలినము లెదుగ జుడగును మనము మిసిమి
చదువుల కతడు నిలయము చదువరి గద.

తే.గీ. కలశమున గలదట గద అలకనంద
అతని చెలియగ యలరెను యతివ వన
ఎఱుక పరచను అహిపతి యెదురు బడియె
నెఱయు నాసతి కలశము నరయ జలము.

సీ. విడువడు మనుజుల విసురుగ బలికిన
తలచును మనిషిగ తరలి బొవును
వరములు అడుగడు వదనము వెలయుగ
మలినము కడుగును మకిలి గనము
పవనము గనెదను పసగల యతనిలొ
అబలలు యనగను యాడువార
ల వలదట్టి పదముల వయును జేయకు
నగజను మరువకు నరుల సుతిని.

తే.గీ. అనుచు బలకను సతతము యతడు యటులె
ఎఱుగడు కపటము యణుచు యెదురు నెగడి
కొలుచు మనుజుల మనసున గిరిజనెపుడు
పొగడను బలుకులు కరువు పొరిమి సంజ..

## వీ.ఆర్.గణపతి గారు

**మాన్యశ్రీ నారుమంచి అనంతకృష్ణ దంపతులకు షష్టిపూర్తి**
**శుభాకాంక్షలతో వినయపూర్వకంగా సమర్పించు పద్యరత్నాలు**

ఆ.వె: తెలుగు సంస్కృతముల దివ్యమౌ కవితల
లాఘవమున వ్రాయు లాయరతడు.
దైవభక్తి, సంఘ సేవానురక్తియు
ధర్మనిరతి గలుగు దాత యతను. 1

తే.గీ: దినము తీరిక లేనట్టి పనుల కొరకు
తిరుగు నూళ్ళను.నడువడు. పరుగులిడును.
ఎంత భారమ్ము నైనతా నెత్తుకొనును.
"అమ్మ దయ" యంచు వినయాన నను నతండు. 2

ఆ.వె: నుదుట భాస్కరుండు. మెదడులో న్యాయ శా
స్త్రమ్ము. మదిని తెలుగు కమ్మదనము.
సంస్కృతమ్ము నడత. సాక్షాత్తు వారితో
"నమ్మవారు" నడుచు ననవరతము. 3

తే.గీ: భాషలెన్నియో నేర్చిన పండితుండు.
పరమ భక్తుండు. కవియును వక్త. దాత.
న్యాయమును గాచు తత్వమ్ము. నవ్వు నెపుడు.
మంచి మిత్రుండు. నరుదైన మంచి మనిషి. 4

తే.గీ: 'ఆకసమ్మున విహరించు నట్టి పద్య
కవిత భువి పైన జనులతో కలిసి మెలిసి,
వలయు కష్ట సుఖమ్ముల పంచ' ననెడు
వారి సంకల్పమీ ప్రజ-పద్య గ్రూపు.. 5

తే.గీ: నన్ను, పట్వర్ధనుని తాననంత కృష్ణ
గారు సహ యడ్మినులు గాను గారవింప,
భాగ్యమది నాకు. పెద్దల పరిచయమ్ము
చేత జ్ఞానమ్ము పెరిగె. నా వ్రాత మారె. 6

ఆ.వె: అరువదేడులన్న నది మేనికే గాని
మనము శిశువు గాను మారు మరల.
షష్టి పూర్తి నాడు సన్మిత్రుపై "నమ్మ"
చల్లనైన చూపు జల్లు గాక !! 7

## పట్వర్ధన్.యం.వీ. గారు

***ఆత్మీయులు ఆణిముత్యం అనంతకృష్ణ గారి***
***షష్టిపూర్తి. (25-12-2017) సందర్భముగా సమర్పించిన***
***పంచరత్నములు.***

ఉ. శ్రీయుత నారుమంచి కులసింధు సుధాంశు ననంత కృష్ణు న
త్యాయత మానవత్వ విభవాన్విత సుస్మిత దివ్యనేత్రు స
త్యాయత నాంతర స్థిరవిహారు మహోరుకృపా విచారు నా
త్మీయుని బద్య బాంధవుని మిక్కిలి గొల్చెద భక్తి మీరగన్ 1

కం. సర్వోన్నతుడౌ జ్ఞానిగ
బర్వియు దా నంతరాత్మ బసివాడగు మా
శర్వాణీ సుతు గొల్చెద
గర్వం బొక్కింత లేని ఘనచారిత్రున్ 2

తే.గీ. చందనములోని మిక్కిలి చల్లదనము
తేనె తియ్యందనము మల్లె తెల్లదనము
లన్ని కలియుచు దానొక వ్యక్తియైన
మా యనంత కృష్ణుని గొల్తు మానసమున. 3

కం. వనజాసనుడును గౌరీ
వనజాక్షీ వల్లభుండు వనరుహ గర్భుం
డనిశంబనంత కృష్ణుని
వనజాప్రాణేశు బ్రోవ బ్రార్థించెద నేన్ 4

తే.గీ. సిద్ధ సంకల్పునకును బ్రసిద్ధ కవికి
ధన్య జీవికి నిత్య చైతన్య రవికి
సత్వరముగ నర్పింతునీ షష్టిపూర్తి
సమయమున శుభాకాంక్షలు సంతసమున. 5

స్వస్తి



# నారుమంచి వేంకట అనంతకృష్ణ

| | |
|---|---|
| జననం | స్వస్తిశ్రీ హేమళంబి నామ సం॥పుష్య శు॥సప్తమి<br>తేది 27-12-1957 |
| జన్మస్థలం | హన్మకొండ, వరంగల్ జిల్లా<br>(మాతామహుల ఇంట) |
| జననీజనకులు | శ్రీమతి సరోజిని<br>శ్రీ ఎన్.వి.యస్. శర్మ గార్లు |
| నివాసం | శ్రీ సాయినగర్, నాగోల్ పోస్ట్, హైదరాబాద్-68<br>ఫోన్. 9246531895 |
| వివాహము | 17-12-1980 ధర్మపత్ని వనజ |
| సంతానము | కూతురు - అపర్ణ, అల్లుడు - రఘురామమూర్తి<br>కొడుకు - శంకర కౌశిక్, కోడలు-శ్రుతి కీర్తి<br>మనుమడు - కశ్యప్ మనుమరాళ్ళు - హాసిని,<br>సహస్ర కౌముది |
| విద్యార్హతలు | B.Com., LL.M., M.Sc (Psy), PGDADR,<br>PGDIPR & CL |
| వృత్తి | హైదరాబాద్ హైకోర్ట్ న్యాయవాది |
| ప్రవృత్తి | వేదాంత, సాహిత్యాలపై మక్కువ, రచన, ఉపన్యాసాల<br>వ్యాసంగం, ఫేస్‌బుక్ ద్వారా పద్యరచన సంస్కృతాధ్యయన<br>ప్రచారము |
| రచనలు | శ్రీ గురు సహస్రనామ స్తోత్రము,<br>లలితా, గణపతి, సూర్య, శ్రీధర, శివ దేవతాత్మక<br>శతకములు |